# జాతీయనాయకులు

## ( ప్రథమ భాగము )

కీ॥ శే॥ కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు

అదృష్టవంతుడు

డాక్టర్ పట్టాభి

మేధావి

యెర్రమిల్లి జగన్నశాస్త్రి

విప్లవకారుడు

అయ్యదేవర కాళేశ్వరరావు

సంస్కర్త


రచయిత

కోటమర్తి చినరఘుపతి

(ప్రతాపసింహ, సుయోధనవిజయము, చితోడుపతనము, వెన్నెలవెలుగులు

కోటమర్తి కథలు, కోటమర్తి సాముద్రికం)





ప్రకాశకులు

పసుపులేటి బాపిరాజు,

శ్రీసత్యనారాయణ పబ్లిషింగ్ హౌస్,

రాజమండ్రి

1945

# ఉపోద్ఘాతము



సర్వవిధముల వెనుకబడియున్న ఆంధ్రరాష్ట్రమును వివిధమార్గముల నభివృద్ధిలోనికి దెచ్చుటకై యత్నించుచు పని చేసిన ఆంధ్రజాతీయనాయకుల జీవితచరిత్రములువ్రాసి తన్మూలమున నాంధ్రులసేవ సేయుటే నాముఖ్యోద్దేశము. ఈగ్రంథ మూలమున, రాష్ట్రములోను దేశములోను ప్రబలిన పలు సంస్థలచరిత్రములు, ఆయాసంస్థలకు సంబంధించిన నితరుల గూర్చిన ప్రశంసలు, వివిధసంస్థల విజృంభణాదికములు, తత్పర్యవసానములు తెలియబఱచుట యిందలి ముఖ్యోద్దేశములు ఈనాగ్రంథరచనమునకు పెక్కండ్రుమిత్రులు లనేకవిధముల సాయమొనర్చిన 1 నిడదవోలు వేంకటారావు, 2 గుమ్మిడిదల సుబ్బారావు, 3 అయ్యదేవర కాళేశ్వరరావు, 4 మల్లిపూడి పళ్ళంరాజు, 5. శంభు ప్రసాద్, 6 మల్లాది లక్ష్మీనరసింహ శాస్త్రిగార్లకు నాప్రత్యేకనమస్కారములు

ఇట్లు,

కోటమర్తి చినరఘుపతి.



ర చ యి త

కోటమర్తి చినరఘుపతిరావు

ఈ నా గ్రంథరచనమునకు వలయు విషయముల నీదిగువ నుదహరించిన పత్రికల గ్రంథముల సహాయ్యమున సమకూర్చితిని

పత్రికలు

1 ఆంధ్రపత్రిక
2 ,, వారపత్రికలు
3 ఉగాదిసంచిక
4 భారతి
5 ప్రజామిత్ర
6 ప్రజాపత్రిక
7 కృష్ణాపత్రిక
8 కొన్నిప్రత్యేకసంచికలు
9 సుధర్మ
10 జనవాణి
11 మాతృసేవ
12 జయభేరి
13 మహారటా

గ్రంథములు

1 Sedition Committee 1918 Report
2 Directory of the Madras Legislatures
3 Men in the limelight
4 Constructive Programme
5 ఆంధ్రమహాపురుషులు
6 నిర్మాణకార్యక్రమము
7 భారతీయనాగరకత
8 ప్రపంచవీరులు
9 Gandhi Muslim
10 చిలకమర్తివారి స్వీయచరిత్ర
11 History of the National Congress
12 పంజాబువధలు
13 పెషావరు ఎన్క్వాయిరీ రిపోర్టు

శ్రీరామ!

# జాతీయనాయకులు.

## లి ప లు కు

హిందూదేశమునందలి వివిధరాష్ట్రములలో నాంధ్రరాష్ట్ర మొక్కటి ఈరాష్ట్రము ప్రత్యేకప్రభుత్వపరిపాలనా విధానము లేక తమిళ మళయాళ కన్నడరాష్ట్రములతో భాగస్వామియై చెన్నపురిరాజధానిగా పరిగణింపబడుచుండె అందుచే నాంధ్రులకు ప్రత్యేకరాష్ట్రము ప్రత్యేకవ్యక్తిత్వము లేదు భాషాప్రయుక్తరాష్ట్రముగ విభజింపబడుటకు పెద్దలు సేయు కృషి యీనాటివఱకు వమ్మైనది మొన్న నీనడుమ నాంధ్రరాష్ట్రముప్రత్యేకింపబడుసూచనలు పొడగట్టినవి కాని మనప్రయత్నమునకు సంబిశకున మెదురైనదట ఇది యెల్ల ఆంధ్రుల దురదృష్టము

## నే టి యాం ధ్ర లో క ము

మనదురదృష్టము సర్వతోముఖముగ విజృంభించినది ఆంధ్రులలో నైకమత్యము తక్కువయని లోకమునకు వెల్లడియైనది ఆంధ్రునకు కలిగిన స్వల్పముతో సంతుష్టినందుట

దుర్భరమైన లక్షణమే ఎక్కువబత్తెమునకైన నెక్కువజీతమున కైన నాంధ్రుడు స్వగ్రామమును వీడడు జనసామాన్యము నకు వ్యవసాయ మాధారమగుట నుద్యోగాదులకైనగాని వాణి జ్యాదులకైనగాని యాంధ్రుడు స్వగ్రామమును వీడడు అం ధ్రులలో బహునాయకత్వము ప్రబలినది రాష్ట్రమంతయు నాయకులమయమే కాని యాశ్రయించువారు అనుసరించు వారుమాత్ర మాంధ్రులలో లేరు రాష్ట్రాభిమానము పూర్తిగ లేదని చెప్పవచ్చును పరమతిప్రాబల్యమున కాంధ్రరాష్ట్రము చిక్కని పంటభూమి స్వమతిప్రాబల్యమునకు పట్టిచవిటిఎట్టి పరప్రభుపరిపాలనమున కాంధ్రరాష్ట్రము చిక్కనిపట్టుగొమ్మ స్వపరిపాలనమునకు పట్టిములగకొమ్మ పరవ్యాపారపారీణుల కాంధ్రరాష్ట్రము బంగరుభూమి ఆంధ్రవ్యాపారస్థుల కది పట్టి బంజరుభూమి ఆంధ్రమునకు, ఆంధ్రప్రజలకు, ఆంధ్రరాష్ట్ర మునకు, ఆంధ్రజాతికి స్వశబ్దముకన్న పరశబ్దమే పరమవిశ్వాస పాత్రమైనది ఆంధ్రుడనిన నాంధ్రున కభిమానము లేదు ఆంధ్రభాషయనిన నాంధ్రున కభిమానము లేదు ఆంధ్రరాష్ట్ర మనిన నాంధ్రున కుత్సాహము లేదు ఆంధ్రవ్యాపారస్థలముల యం దాంధ్రులకు నమ్మిక లేదు ఆంధ్రులు పూర్వము విదేశ ముల కేగి వ్యాపారాదు లొనర్చి విశేషధనాదుల సమకూర్చు చుండెడివారట ఈనాడో గ్రామముదాటి యడుగైన బెట్టరు అందుచే నాంధ్రవాణిజ్య మడుగంటినది వ్యాపారాదులు నన్నగిల్లినవి ఆంధ్రు డేవిధకర్మాగారముల బెట్ట నుత్సహిం

వడు. పెట్టినను ప్రజలు హర్షింపరు శీఘ్రపతన మాకర్మా గారమందలి మొదటిపునాది యిటుకపైననే వ్రాయబడి యున్నది కలిగినదానితో నల్పసంతుష్టుడై యాంధ్రుడు జీవించుకొనటకు నిశ్చయించుకొనిననాటినుండియు నాంధ్రు డధఃపతితు డగుచున్నాడు వేయేల? ఆంధ్రశబ్ద మనర్థదాయకశబ్ద మని చెప్ప సంఖ్యాశాస్త్రజ్ఞులుకూడ బయలుదేరిరి రాష్ట్రమునకై లేదు పట్టుదల, భాషకై లేదు పట్టుదల పదమునకై వలసినంత పట్టుదల బయలుదేరినది ఇదియైన నొకటి రెండు చోటులనుండియే బయలుదేరినది ఆంధ్రులు మెట్టవేదాంతులు స్వీయపరకీయభేదశూన్యులు సర్వమునకు నిర్లిప్తత సమస్తమునకును భగవంతునిదే భారమందురు స్వప్రయోజనదూరులు స్వలాభాపేక్షారహితులు ఆంధ్రులు దురదృష్టవంతులు దురదృష్టవంతులు కొన్నిశతాబ్దములనుండి నిద్రించుచున్న నిద్రనుండి వారింకను మేల్కొనలేదు ఇంతలో మేల్కొనుసూచనలు లేవు ఈభూగోళమందు బూర్వ మాంధ్రుడు దాటని సముద్రము, చూడని దూరదేశము, కాపురముండి
తనవ్యాపారమును నిర్వహించుకొనని యన్యరాష్ట్రమును లేదు 2
అట్టి యాంధ్రునిమహోత్కృష్టత యడుగంటినది అట్టియాంధ్రుని విదేశపర్యటనసన్నాహము నామమాత్రావశిష్టమైనది అట్టి యాంధ్రునిపరదేశవ్యాపారము పతన మొందినది ఆంధ్రునిలోని యాంధ్రత్వమే నశించినది ఇక నాంధ్రునకు మిగి

లినది యంధత్వమే ఇట్టివారే యీనాటియాంధ్రులు నిక్క ము కటువుగ జెప్పినందులకు పెద్దలు మన్నింతురుగాక!

నే నిట్లు శాపాలాపము లాడుచున్నానని చదువరులు కినియవలదు ఆంధ్రులలో నభినివేశము లేదని యాక్రోశించు వారిలో నే నొక్కడను ఆంధ్రులకు సర్వతోముఖముగ నభి వృద్ధి రావలెనని కోరువారిలో నే నొక్కడను ఆంధ్రరాష్ట్రా భిమానము సంపూర్ణముగ నూటికి నూరుపాళ్ళు గలిగియుం డియు నాంధ్రరాష్ట్రాభివృద్ధికై యాంధ్రులలో నుత్కృష్టు లైనవారినిగూర్చి యాంధ్రులకు జూపి వారివలె సదాశయులై దేశహితైక కార్యములకు గడంగుడని ప్రోత్సహించుటకే యీ నా గ్రంథరచనము ఏఒక్కవ్యక్తియో ఆంధ్రులలో నధికుడై నంతమాత్రమున దేశమునకు ఘనత రానేరదు ఆంధ్రులంద రొక జాతిగా నుత్కృష్టతకు రావలె ఆంధ్రులలో త్యాగము, ఉత్సాహము, అభినివేశము, బహుళవ్యాపారనిర్మాణదక్షత, విదేశవ్యాపారార్థ మన్యదేశాక్రమణ, వివిధవిధోద్యోగనిర్వ హణపటిష్ఠత, బహుశాస్త్రపరిశోధనాభినివేశము గలిగి దేశము నభివృద్ధిలోనికి దీసికొనిరావలయును ఇది ఆంధ్రు లందరి కర్తవ్యము.

కాలమొక్కరీతినే గడువదు ఎంతనిబిడాంధకారబంధు రమైన యమావసనిశియందైనను దెరువరి కొక్కింతబాట,

యొక్కించ యాశాజ్యోతి, కనబడకుండునా? కంటకావృతమై దుర్భేద్యమైన తోవ నొక్కింత నమతలము దొలకక పోవునా పథికున కడుగు మోపుటకు? మూడుకోటుల యాంధ్రులలో నొక్కడైన యదృష్టవంతు డుద్భవింపక పోవునా? ప్రపంచమం దెంతచిన్న రాష్ట్రమైన నెంతచిన్న సంఘమైన నున్నచో నం దొకవ్వ డొకనాయకు డుద్భవించియే తీఱును ఆనాయకు డాదేశమునకు మహోపకృతు లొనర్చి దేశసేవాధురంధరు డని పేరుపొందును తనదేశమునకు దనప్రజలకు దాను జేయ వలసినసేవ జేసి, ధన్యజీవుడై, పూతచరితుడై, తనప్రజలకు జిర స్మరణీయుడై విరాజిల్లును అతడే, యనంతవిశాలాకాశమందు ధృవతారయై ప్రకాశించును ఆంధ్రులయభివృద్ధి కాత డొక ఆదర్శప్రాయు డగును



## ౧

## దేశోద్ధారక – విశ్వదాత – కళాప్రపూర్ణ

# కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు గారు - అదృష్టవంతుడు

మానవుని యభివృద్ధికి గారణములు రెండు మొదటిది దైవబలము, రెండవది మానవునికృషి. ఈయుభయవిధములను దెలిసికొనుటకు విశదీకరింప యత్నింతును

దైవబలసంపన్నుడే యదృష్టవంతుడు సామాన్య మానవదృష్టికి గోచరింపని యొకదివ్యశక్తి యావ్యక్తియందు మూర్తీభవించి యుండుటచే నాతడెట్టి యడ్డంకులనైన నవలీల దాటి విజయమందుచుండును దైవబలము ముందు దారి తీయుచుండ, నీయదృష్టవంతు డావెనుక జాడల జూచుకొనుచు నేగుచుండును అందుచే నీయదృష్టవంతుడు చేసిన కృషి ఫలించును తలచినతలంపు లాభించును అట్టిదైవబలసంపన్నున కపజయమనునదియుండదు అనాలోచనీయ మనునదిజరుగదు

ఆతనియూహా కతీతమైనది చేతకు గష్టసాధ్యమగునదియు లేదు ఆతనిహృదయములో దైవబలము, తలంపులో దైవబలము, చేతలలో దైవబలము దీపించుచుండును అట్టి వానిజీవితమే సర్వ సుఖదాయకమైయుండును అట్టివానికరతలముననే పరసువేది బ్రదుకు అట్టివానికటాక్షవీక్షణ ప్రసారములయందే శ్రీనాట్య మొనరించి వర్ధిల్లు అందుచే నీతడు వర్ధిష్ణువు అదృష్టవంతుడు మానవాతీతమైన యాదైవబలమే మానవుని యదృష్టవంతుని జేయును ఆయదృష్టమే దైవబలము ఆయదృష్టవంతుడే దైవ బలసంపన్నుడు అట్టి వానిజీవితమే ధన్యము సుఖాంతకావ్యము వోలె నది పఠనీయము ఆ మానవునికృషియే చిరస్థాయియై నిలిచిపోవును ఆకృషియే విశ్వకర్మనిర్మితదివ్యభవనమై దిగంత ములకు దనసైగనిగ్ధ్యముల బ్రసారించుచుండును ఆకృషియం దే దైవసంకల్ప మున్నది దైవబల మున్నది దైవమే తోడు నీడయై యుండనిలిచి యాకృషిని దిగ్విజయముగ నొనరించును అట్టి దైవబలసంపన్నుడే మన నాగేశ్వరరావు పంతులుగారు

## వీ రి జ న్మ ము

మన నాగేశ్వరరావుపంతులుగారు అక్షయనామ సంవ త్సర చైత్రి బహుళ యేకాదశి యనగా 1-5-1867 సం॥ర

మున కృష్ణాజిల్లాలోని యెలకుఱ్ఱుగ్రామములో జన్మించెను ఈ యెలకుఱ్ఱు వీరి స్వగ్రామము తండ్రి బుచ్చయ్య అయ్యా వార్లంగారు తల్లి శ్యామలాంబ ఈదంపతుల చిరతపఃఫలమే పంతులుగారు చిరస్మరణీయు లీ పంపతులు పంతులుగారితో నొకతోబుట్టువు, నొకసోదరుడునుగూడ నీదంపతులకు గలిగిరి పంతులుగారు బాల్యమున స్వర్ణదర్వీక నవనీతభుక్కులు, గారు హంసతూలికాతల్పముల నధివసించినవారు, గారు ధర్మహర్మ్యముల బైడియుయ్యెలలలో బవ్వళించినవారు, గారు బీదలగతి, సామాన్యులలీల, సాధారణులపోలిక జీవించినవారే సామాన్య గృహస్థులైన వీరి తలిదండ్రులు పంతులుగారిని కంటిలోని పావవలె పెంచుకొనుచుండిరి పంతులుగారు బాల్యావస్థనుండి విద్యార్థిదశకు వచ్చినపుడు వీరికి సంస్కృతాంగ్లవిద్యలలో నేది చెప్పింపవలె ననుప్రశ్నము రాగా దండ్రిగారు సంస్కృత విద్యయనియు దల్లిగా రాంగ్లవిద్యయనియు వాదించుకొనిరి కాని తుదకు దల్లిగారిమాట కంద అంగీకరించిరి అందులకై వీరు బందరునకు సకుటుంబముగ నేగిరి

## వీరిబాల్యము – విద్యాదికము

పంతులుగారిబాల్యము బందరులో గడచినది వీరిని బాల్యమునందు నాగలింగమని యెల్లరు పిలుచుచుండెడివారు

వీరును భాగవతుల సుబ్రహ్మణ్యముగారును వారణాశి రామ సుబ్రహ్మణ్యముగారును బాల్యస్నేహితులు. వీరు ఘస్టుఫార ములోనే సంస్కృతాభ్యాసమునకు బ్రారంభించిరి. రఘువం శము, హితోపదేశము, మేఘసందేశము మొదలగు సంస్కృత పాఠ్యగ్రంథముల నెల్ల జదివిరి 1883 సం॥ రములో మిడిల్ స్కూలుపరీక్షయందు తీర్ణులైరి 1885 సం॥రములో మెట్రి క్యులేషన్ పరీక్షయందు త్తీర్ణులైరి వీ రీవిద్య నభ్యసించునపుడు బందరులో వేణుగోపాలస్వామివారి యాలయమునకు దగ్గఱగా నున్న కామరాజుగడ్డ వారియింటిలో నకుటుంబముగ కాపుర ముండెడివారు బందరులో విద్య పూర్తియగువఱకు వీ రచ్చ టనే కాపుర ముండిరి పిదప చెన్నపురి క్రిష్టియన్ కాలేజీలో బి యే చదివిరి హిస్టరీలో మార్కులు తక్కువవచ్చుటచే బి యే. పరీక్షలో తప్పిపోయినారు

ఈ వయసునందే గాబోలు పంతులుగారు నాటకము లందు వేషధారులైరి ఒకటి రెండు నాటకసంఘములగూడ స్థాపించిరి ఇందులకు గారణ మొక్కటి కానవచ్చుచున్నది ఆ కాలములో బూనానుండి యొకనాటకసంఘ మాంధ్రదేశము నకు వచ్చినది. వారు మంచిప్రదర్శనముల బ్రదర్శించెడివారు ప్రజలు వేలాదిగ బ్రదర్శనముల జూచి నేగెడివారు ఆనాటి వఱకు బ్రజలు వీధిభాగవతముల జూచుటయేగాని యిట్టి దుస్తులతో, తెరలతో, మంచిగానముతో నున్నరంగస్థలముల

జూచి యెఱుంగరు ఈప్రదర్శనముల జూచిన ప్రజానీకమున కుత్సాహము జనించినది ఈ పూనాకంపెనీవారు వెళ్ళిన గ్రామము లన్నింటిలోఁగూడ నాటకసంఘము లేర్పడినవి కాకి నాడలో సింగితపు అబ్బాయి అను వెంకట్రావుగారి కంపెనీ, రాజమహేంద్రవరములో హిందూనాటక సమాజము, గుం టూరులో బలిజేపల్లి లక్ష్మీకాంతం హరిప్రసాదరావుగార్లు కలిసి స్థాపించిన నాటకసమాజము బందరులో హిందూథియే టరు ప్రకాశంగారితో యిమ్మానేని హనుమంతరావుగారు స్థాపించిననాట్యమండలి మొదలగు వివిధప్రదర్శనసంస్థ లొక్క సారిగా బయలుదేరినవి ఇవి బయలుదేరినకాలము కొంచెము ముందువెనుకలుగ నుండవచ్చునుగాని కారణ మందఱ కిది యొక్కటియే ఈపూనానాటకప్రదర్శనములే యాంధ్రనాట కరంగస్థలములకు నూతనచైతన్య మొసంగినవి ఆకాలమున నభివృద్ధికి వచ్చిన బందరు హిందూథియేటరు మనవంతులుగారు స్థాపించినదియే ఆకాలములో నాటకపాత్రధారణము సంఘ నియమవిరుద్ధమై యుండరానిది కాని నూతనోత్సాహము నాప గలవా రెవ్వరు? ఇది యొక మహాతరంగమువలె నాంధ్రదేశ మంతయు నాక్రమించినది ఆకాలముననే చిలకమర్తి లక్ష్మీ నరసింహముగారు, బలిజేపల్లి లక్ష్మీకాంతంగారు, వడ్డాది సుబ్బారాయుడుగారు, కందుకూరి వీరేశలింగముగారు మొద లగు నాటకకవులును శ్రీనాగేశ్వరరావుపంతులుగారు, శ్రీ

టంగుటూరి ప్రకాశంపంతులుగారు మొదలగు పాత్రధారులును బ్రిభవించిరి హిందూధియేటగును బంతులుగారివలెనే ఇమ్మానేని హనుమంతిరావునాయుడుగారి నాటకసమాజమునకు ప్రకాశంపంతులుగారు ప్రోత్సాహకులై పాత్రధారులైరి నాగేశ్వరరావు పంతులుగారే యొకటి రెండు ప్రదర్శనములలో నటించిరోగాని వారికి నాటకాభిమానము చివరవఱకును బోలేదు మహదైశ్వర్యసంపన్నులై యున్నతటి విశేషముగ వెచ్చించి దుర్గాకళామందిరమును నిర్మించిరి బందరులో వీరు విద్యపూర్తి చేసికొని మిగిలిన యున్నతవిద్యలకై మదాసునకు వెడలిరి

వీరు మదాసులో నున్నకాలములో రెంటాల వెంకట సుబ్బారావుగారి యింటిలోనే బస వెంకటసుబ్బారావుగారు వీరికి సన్నిహితులు ఆంధ్రులలో నొకమహావ్యక్తి గొప్ప ప్రతిభాశాలి వారిమేనకోడలినే పంతులుగారికిచ్చి 1890 సం॥ర మున మదాసులోనే వివాహము గావించిరి ఆమెపేరు రామాయమ్మగారు శ్రీసుబ్బారావుగారిసాంగత్యమే పంతులుగారి యభివృద్ధికి మూలకారణము పంతులుగారి కీవ్యావహారిక లౌకిక జ్ఞానములు సుబ్బారావుగారి సన్నిహితత్వముచేతనే యలవడినవి సుబ్బారావుగారివ్యాపారదృష్టి వీరికన్ను దెఱచినది మైలపూరులోని సుబ్బారావుగారి విక్టోరియాడిపో పంతులుగారిజీవితమునకు విజ్ఞానమునకు భాగ్యోదయమునకు వసతిగృహమై పాఠశాలయై టంకసాలయై విరాజిలినది

## రెంటాల వెంకట సుబ్బారావుగారు

పంతులుగారినిగూర్చి వ్రాయునపుడు వారి కాదర్శ ప్రాయుడైన సుబ్బారావుగారిసంగతి వ్రాయుట యనవసరము గాదు. సుబ్బారావుగారుపంతులుగారి భార్యకు మేనమామ అద్భుతమేధావి బి యే బి యల్ పరీక్షయం దుత్తీర్ణులయి మదాసు హైకోర్టులో జిరకాలముండెను విశేషధన మార్జిం చెను ఈసుబ్బారావుగా రొక్క న్యాయవాదులే గాదు వ్యవ హారదక్షులలో నగ్రగణ్యులు మానవమానసిక తత్త్వవేత్త గొప్పచదువరి వివిధగ్రంథనిర్మాత శృంగారరసపూరితమైన సురాభాండేశ్వరము సుబ్బారావుగారు రచించినదే వితంతు విలాపనెపమున వ్రాసిన కమలాలేఖలుకూడ వీరు రచించిన వియే ఈగ్రంథ మిరువదియైదువేలప్రతు లమ్ముడుపోయినవి ఆంధ్రమునందే గాక యాంగ్లమునందుగూడ వీరు ప్రజ్ఞాధురీ ణులే ఆంగ్లమహాకవి షేక్స్పియర్ వీరి కాదర్శకవి వారి మహానాటకములు హేమలెట్, ఒథెల్లో గ్రంథములందు వీరికి అభిమానముమెండు అందుచే వీ రాగ్రంథములకు భాష్యముల వ్రాసి ప్రకటించిరి ఈగ్రంథము లింగ్లాండునందు ముద్రింప బడినవి ఒక్కొక్కగ్రంథము వెల నూఱుకాసులు అనగా రమారమి రు 5000 ఖరీదు ఇంగ్లాండునం దున్న షేక్స్పియర్

సమాజమువా రాంగ్లమున ప్రకటింపబడు షేక్స్పియర్ నాటక ముల భాష్యములు వానిమూల్యములతో ప్రసక్తి లేకుండ, సెంటిఖరీదైనను గాని వారిగ్రంథాలయములో నుంచితీరవలె నట అందుచే సుబ్బారావుగా రాయంచసాపై నూరు పెద్ద కాసులు ధర పెట్టి వారికి రెండేసి ప్రతుల నొసగి ముద్రణ వ్యయ మంతయు నా రెండుగ్రంథములద్వారమునను రాబట్టు కొనెనట మద్రాసు గవర్న రా గ్రంథముల నూఱురూపాయల చొప్పున ఖరీదు నిచ్చి కొనెనట దీనినిబట్టి సుబ్బారావుగారి మేధాశక్తియు వ్యవహారదక్షతయు దెలియనగును

వీరి సారస్వతవిషయకప్రజ్ఞావిశేషాదులకంటె వీరి వ్యవ హారదక్షతనుగూర్చి లోకములో వ్యాప్తి జెందిన కథలు కొన్ని ప్రబలియున్నవి ఈకథలయందలి సత్యాసత్యములు దైవమున కెఱుక అదృష్టదీపిక యను నొక చిన్నగ్రంథమున నాసంవ త్సరపంచాంగము గ్రహగతులు శకునములు ప్రశ్నలు ప్రశ్న ఫలితములు మొదలగు నాకర్షణీయములగు విషయముల వ్రాసి విక్టోరియాడిపో మైలాపూరు మద్రాసునుండి ప్రకటించుచు విశేషధనము నార్జించిరట ప్రజానీకమున కందుబాటులో నుండుఖరీదుపెట్టి మద్రాసునందలి యుత్సవాదులలో తరవాణి యమ్మించెడివారనియు నింగ్లాండున కప్పడములు, ఊరుగా యలు, చారు మొదలగునవి యెగుమతి చేసి యమ్మించెడివా రనియు బ్రతీతి గిల్టువస్తువులవ్యాపారప్రారంభమునకు విఘ్న

శ్వరపూజ సుబ్బారావుగారే చేసిరట "ధనమును పోగుచేసి కొను విధమును దెల్పుదును అది తెలిసికొన గోరువారు నా కొక యణాబిళ్ళ పంపవలె" నని ప్రకటింప వేలాదిగ వారి కణాబిళ్ళలుంచిన జాబులు వెళ్ళినవనియు దుద కొకనాటి పత్రి కలో "ధనము పోగుచేసికొనువిధ మిదియే నా కీపత్రికటనము వలన నిన్నివేలరూపాయలు వచ్చినవి" అని ప్రకటించిరట ఇట్టికథ లనేకములు గలవు వీనియందలి సత్యనిర్ధారణము నా పనిగాదు

## పంతులుగారి వ్యాపారాభివృద్ధి

పంతులుగారు సాధారణకుటుంబములోనివారు వీరికి చరాస్తి విశేషముగా లేదు స్థిరాస్తి మొదట ముప్పదియకర ములభూమి, యొకయిల్లుమాత్రమే యుండెడివి వీరీయాస్తిని బురస్కరించుకొనియే వ్యాపారమునకు గడంగిరి పంతులుగారి వ్యాపారాభివృద్ధికి మూలమైన యమృతాంజనమునుగూర్చిన కథ యొకటి గలదు ఇది కథయని నమ్ముటయే ధర్మముగాని సత్యమని నమ్ముట ధర్మసమ్మతము గాదు నే నీనడుమ బంతు లుగారినిగూర్చి రచించినగ్రంథ మొండు జదివితిని. అం దిట్లు న్నది "తనభార్యయొక్క నతి కవసరమగుపునాదిని వేయునపుడ మున గొన్నియిటుకలను వేంకటసుబ్బారావుగారి పద్ధతినుండి

గైకొనినను నాగేశ్వరరావు సంపూర్ణ భవననిర్మాణమును స్వీయయత్నములచేతనే చేయించెనని సూక్ష్మదృష్టివలన మనము గ్రహింపగలము Victoria Depot (విక్టోరియా డిపో) నుండి కొండొకభావమును గైకొని William & Co (విలియం అండ్ కో,) మూలబంధమునసీతడు ప్రవేశపెట్టియుండును ఇదియే క్రమక్రమముగ బెరిగి Amrutanjanam Depot (అమృతాంజనం డిపో) ఆయెనని తెలుపవచ్చును"అని "ఆంధ్ర మహాపురుషులు" అను గ్రంథమునందు లిఖింపబడెను

ఇది పట్టి అనుచితపువ్రాత, కలమున కిట్టమువచ్చినట్లు నడిపించిన వ్రాత ధర్మాధర్మవిచక్షణము లేనివ్రాత పంతులుగారెన్నడు నట్టివారనివని యొనర్చెడివారు కారు అట్టిదానిని దైవము హర్షింపడు సత్యపథగామి జీవితములోని మహాత్తరజీవితమే, పంతులుగారిది అధర్మపరుని యభివృద్ధి గగనకుసుమము అసత్యవాదికీర్తి తుదకు మషీచూర్ణపటలి నైతికవిజయము లేని నరునకు భౌతికవిజయ మప్రధానమై దుఃఖభాజనమై యలరారును అధర్మపరుని యంతిము దుఃఖాంతమే కాదనువారు దైవము లేడనువారే సుఖాంతజీవితము సత్యవాదిదే సత్యధర్మస్వరూపమే దైవము స్వామిద్రోహమే ప్రత్యక్షనరకము

## బొంబాయి

పంతులుగారికి బొంబాయి వెళ్లినపిదప నచ్చట నొక వ్యాపారస్థునితో స్నేహము కుదిరినది ఆతనిపేరు గణపతి పం

తులుగారికి కుడిచేయివలె నుండెడివాడు. ఆగణపతిగారి సాహాయ్యముతో విలియంకంపెనీ స్థాపించినారు మొదటి రెండు సంవత్సరములలో సాలుకకు రు 1500 లాభము వచ్చెడిది దానినే పంతులుగారభివృద్ధి చేసినారు అది క్రిమక్రిమముగా పెరిగి సాలుసకు రు 1, 50, 000 నుండి రెండు లక్షలవఱకు లాభమును గడించిపెట్టెడిది వీరు బొంబాయిలో నున్నకాలములో వర్తకులలో మంచిపేరును సంపాదించుకొనినారు అమృతాంజనముతో బాట్లీయుర్వేదౌషధముల జేసి వానిని విక్రియించెడివారు ఎన్నియౌషధముల నొనర్చి విక్రియించినను అమృతాంజనమునకున్న విలువ, అమ్మకము మఱియొకమందునకు దేనికిని లేదు అమృతాంజనమే వీరికీర్తికి వ్యాపారమునకు మూలాధారము వ్యాపారరహస్యవిదులైన పంతులుగా రమృతాంజనమునే నమ్ముకొని దానికై విశేషముగ వెచ్చించిరి హిందూదేశమందలి యన్నిపత్రికలలో రైల్వేస్టేషనులలో టైముటేబులులలో అమృతాంజనప్రకటనమే ఆంధ్రరాష్ట్రములోని విపుధమాన, వార, దైనిక, పత్రికలలో అమృతాంజన ప్రకటనమే వివిధగ్రామములలోని యిండ్లగోడలపై యమృతాంజన ప్రకటనమే నాటకశాలలలో రచ్చసావిడలలో రైల్వేస్టేషనులలో నమృతాంజనమే ప్రదర్శనశాలలోని మొదటిబహుమానము అమృతాంజనమునకే. ప్రతితీర్థములోను అమృతాంజనదుకాణమున నొకనూతనవిధమైన ప్రకటనము

తప్పదు ఇందులకై పత్రికానిర్వహణము తప్పినది కాదు అమృతాంజనముకొఱకై యాంధ్రపత్రికను నిలుపుకొనవలసి వచ్చెడిది ఈయాంధ్రపత్రిక తెల్లయేనుగు అమృతాంజనము నుండివచ్చిన లాభముతో నాంధ్రపత్రికాపోషణము ఆంధ్ర పత్రికవలన బంతులుగారికి వచ్చినలాభము సున్న దృష్టమై చేతికిజిక్కిన లాభము అమృతాంజనమువలన అదృష్టమై చేతికిచిక్కని కీర్తిగౌరవములలాభ మాంధ్రపత్రికవలన

పంతులుగారు విద్యార్థిదశ పూర్తియైనపిమ్మట వివాహము గావించుకొని యన్యరాష్ట్రముల కేగి యభివృద్ధిమార్గ ముల నన్వేషింప నెంచుకొని బంగాళారాష్ట్రములోని కలకత్తా పట్టణమున కేగెను కలకత్తాలో నాయుర్వేదౌషధములు తయారుచేయు బౌమన్‌దొరయు బంతులుగారును మిత్రులైనారు దొరగారిస్నేహమువలన గొలదిగ గడించినను ఆరోగ్యము బాగుగ లేకపోవుటచే దిరిగి మొలకుజ్జు వెడలి యచ్చట రెండేండ్లుండి బొంబాయిపట్టణమున కేగి యచ్చట విలియం అండుకో స్థాపించి పనిచేయుచుండెడివారు అప్పుడే పంతులుగా రమృతాంజనమును కనుపట్టిరి ఆవిధముగ బతులుగారు సంపాదించిన యమృతాంజనవ్యాపారమున, వివిధధనాకర్షణ మార్గముల నరయుచు, విశేషలబ్ధి బొందిరి ఈయమృతాంజనవిక్రయశాల 1894 లో స్థాపింపబడినది

ఇట్టి లాభదాయకమగు నమృతాంజనప్రకటనవ్యాపారముల కొకపత్రిక యావశ్యకమని గుర్తించి యాలోపమును బూరించుటకై యొకముద్రణాలయమును గొనివచ్చి "ఆంధ్ర పత్రిక" యను పేరుతో నొకవారపత్రికను స్థాపించి ప్రకటించుచు దన్మూలమునగూడ నమితధనము నార్జించుటకు బ్రారంభించెను ఆంధ్రభాషయం దానాడు వారపత్రికలుమాత్రమే ప్రకటింపబడుచుండెను ఈపత్రికలకంటె నాంధ్రపత్రికయే యుత్తమోత్తమమైన దనువఖ్యాతి నార్జించుకొనినది ఈ పత్రిక 1908 సంవత్సరమున నెలకొల్పబడినది దినదిన ప్రవర్ధమానమై కొలదిమాసములలో గొన్ని వేలచందాదారుల బ్రోగు చేసికొనినది దేశభక్తిని, రాజభక్తిని, భాషాభిమానమును, స్వయంసహాయమును, ఉదారసంకల్పమును, పవిత్రభావమును పాఠకుల కుపదేశించుటకై యాపత్రిక (ఆంధ్ర) శక్తివంచన లేక పాటుబడుచున్నది అని పంతులుగారు వ్రాసియున్నారు పీ రీయాంధ్రపత్రికను నెలకొల్పుటలో గలయుద్దేశ మిది అట్టి మహదాశయములు గలిగినయీపత్రిక తన్ను నమ్మిన పంతులుగారికి బంగారుపూల బూజ సేసినది అమృతాంజనము గూడ నట్లే దినదినప్రవర్ధమానమై తన్ను నమ్మినపంతులు గారికి గొంగుబంగారమై యొప్పినది వారిచేతికి బరసువేది నందిచ్చినది. ఆంధ్రపత్రికామూలమున నమృతాంజనము, నమృ

నాగేశ్వరరావుగారు

తాంజనముమూలమున నాంధ్రపత్రికయు ననోన్యాశ్రయము నొంది పంతులుగారి కంగరక్షలై ప్రకాశించినవి

## ఆంధ్ర దినపత్రిక

కొలదిసంవత్సరములు బొంబాయినుండి ప్రకటింపబడిన యీపత్రికను మదాసునకు మార్చవలెనని పంతులుగారు తలంచి చెన్నపట్టణమున తంబుచెట్టివీధిలోని గృహమునకు మార్చిరి ఇట్లు మార్పుటలో గల ముఖ్యోద్దేశ మాంధ్రవార పత్రికను దినపత్రికను జేయవలెనను తలంపు ఈతలంపు తోనే వీరు దినపత్రికను నడుప నర్వసన్నాహములు గావించి ప్రకటింప జొచ్చిరి మూడుకోట్లయాంధ్రుల కిది యేకైకదిన పత్రిక పీ రాభవనమునం దాంధ్రపత్రిక పెట్టుటకు ముం దాభవనము క్రైస్తవకళాశాలకు హాస్టలుగా నుండెడిది. ఇం దులోనుండియే పంతులుగారు విద్య నభ్యసించిరి అందులకే యాభవనమును ముందు బాడుగకు దీసి పిమ్మట కొనివేసిరి పంతులుగారు మదరాసులో నేభవనమునందు దమవిద్యార్థి దశను గడపిరో యాభవనమునే రు 46000 కు కొని తరువాత 30 వేలరూప్యముల వెచ్చించి మరమ్మతును గావించి యందు లోనే యాంధ్రదినపత్రికాకార్యాలయమును నెలకొల్పిరి ఈ దినపత్రిక స్థాపించిన చాలకాలమువఱకును ఆపత్రికను క్వాడ్

రోయల్ క్వాడ్ డెమ్మిమెషీనులమీద నచ్చుకొట్టుచుండెడి వారు కాని పంతులుగారు తమపత్రికాముద్రణమునుగూర్చి యెక్కుడు శ్రద్ధతీసికొని Rotary రోటరీప్రెస్సును తెప్పించు కొనవలెనని యభిప్రాయముగలిగి దానికై విశేషధనమును వెచ్చించిరి ఆ మెషీను వచ్చినపిమ్మట దానిని అమర్చుటకై ప్రయత్నించవగా ప్రాతమేడ సరిపోలేదు అందుచే భవనము లోని రెండవయంతస్థును విప్పి మిషనును బిగించి పిదప తదను కూలముగా ఆరెండవయంతస్థును కట్టుకొనిరి ఇంటిపనుల వ్యవ హారములో తీగి తీసిన డొంక కదలుననుసామెత యదార్థ మైనది ఈరెండవయంతస్థుకొఱకై తిరిగి మేడభాగములో చాలవఱకు విప్పవలసివచ్చినది అందుచే మిషనుకన్న యింటి మరమ్మత్తుఖర్చు యెక్కువగా కావలసివచ్చినది ఈవ్యయమం తయు భరించి నూతనఫక్కీని గృహనిర్మాణ మొనర్చి యం దాంధ్రపత్రికను తిరిగి సుప్రతిష్ఠించిరి ఇందులకు రమారమీ లక్షరూప్యములు వ్యయమై యుండవచ్చు ననిరి ఈకొఱంత దీఱుటచే నాంధ్రపత్రికకు మంచిదశ ప్రాప్తించినదని చెప్ప వచ్చును కాని యీదినపత్రిక యెట్టిపరిస్థితులలో మహాప్రసు నకు గొనిరాబడినదో తెలిసికొందము

ప్రపంచమునం దన్నిజాతులవా రొకరి నొకరు ద్వేషిం చుకొను సమయ మది వ్యాపారార్థము ద్వేషాగ్నికీలల కింధన

ములై యెన్నిదేశములో భస్మము కానున్నసమయమది అగ్రిహోవేశపరవశుడగు పరమశివుని తృతీయ నేత్రోం చలనమునుండి దుర్నివార ఘోర భీభత్స ప్రళయాగ్ని జ్వాలామాలికలు ప్రజ్వలించెడి దారుణసమయ మది వదన గహ్వరమందలి కరాళదంష్ట్రిల, మానవ మస్తిష్కభోజనా పేక్షచే దెఱచిన మృత్యుదేవత ప్రళయతాండవమునకు, రంగ స్థలములైన యాదేశములవి సర్వమారణయంత్రసహాయ్యమున దున్ని, విచ్ఛేదిత శల్యశకలముల నాటి, వీరసైనిక నికర రక్త ధారాప్రవాహముల వాని నాప్లావింపజేసి, నూతన వీరాధివీరని కాయసృష్టికై, సర్వయత్నకృతులైన నాటిభూనేత లప్రతిమాన సాహస దారుణకృత్యము లొనరింపనున్న సమయ మది ఈ మహాప్రళయాగ్నిజ్వాలల కాహుతులుకానున్న వివిధయోధా గ్రేసరులకై - పయోగార్తులై - కన్నీరు మున్నీరుగా జేసి పల వించెడి ప్రియాంగనల - మాతృమూర్తుల - దీనాలాపములు దశదిశలకు వ్యాపించుసమయ మది కాక ఘూక గృధ్ర జం బుక వృకాది మాంసాశనులకుమాత్రము పండుగదినము లవి ప్రథమప్రపంచయుద్ధసమయ మది 1914 సంవత్సర మది

ఈదారుణయుద్ధజ్వాలలు హిందూదేశమునకు - నాంధ్ర దేశమునకుగూడ వ్యాపించినవి యుద్ధభూమియే కాకున్నను, ఆంధ్రరాష్ట్రమునుండి వేలాదియువకులు సైనికులుగ సైనికో ద్యోగులుగ జేరిన దినములలో, ప్రజాసామాన్యమున కేనాటి

యుద్ధవార్త లానాడు తెలిసికొనవలసిన యవసరము వచ్చినది ఈతృష్ణను తీర్పగలిగిన దొక్కదినపత్రికయే అందుచే ఆంధ్ర వారపత్రిక 1914 సం॥రములో దినపత్రికయై విరాజిల్లినది వృద్ధి గాంచినది

గ్రామ గ్రామాంతర, రాష్ట్ర రాష్ట్రేతర, స్వదేశ విదేశ, రాజకీయ వైజ్ఞానిక, సాంఘిక, విద్యాది దినదినైక నూతనవార్తావాహినులతో నాంధ్రదినపత్రిక చక్కగ ప్రకటింపబడుచు వచ్చెను రాష్ట్రమందలి వివిధమండలములలోని గ్రామగ్రామములలో, మూలమూలలనున్న చిన్నచిన్న పల్లెలలోగూడ నాంధ్రదినపత్రిక యాదర మందుచు వచ్చినది తద్వారమున వయోజనవిద్య యభివృద్ధి గాంచినది జనసామాన్యమునకు పత్రికాపఠనమం దానక్తిని పెంపొందించినది తద్వారమున రాజకీయపరిజ్ఞానమును నభివృద్ధి పఱచినది విదేశసాంప్రదాయముల, సాంఘికాచారముల, విస్పష్టముగ జెప్పినది స్వదేశమందలి ప్రజాపరిపాలన, కౌన్సిలుల్సు, ఎస్సెంబ్లీలు మొదలగు ప్రజాపరిపాలనసంస్థలలోని రహస్యములను బయట బెట్టినది బ్రిటిషుప్రభుత్వపరిపాలనా విధానములోని గుణదోషముల విమర్శించి నిర్మొగమాటముగ నత్యమును పఱచుచు వచ్చినది ఎన్నికలసందర్భములలో నభ్య మంచిచెడ్డలగూర్చియు, శక్తిసామర్థ్యములగూర్చియు, గ దెలిపి ప్రజలకర్తవ్యమును బోధింపుచు వచ్చినది.

ఇక సారస్వతవిషయములో నాధునికరచయితలకు పట్టుగొమ్మయై ధనలాభమును జూపించినది ఆంధ్రదేశమందలి, పండితులకు, కవులకు, విద్యాధికులకు, విమర్శకులకు ప్రోత్సాహ మొసంగుచు, వారిని గౌరవించుచు వారికీర్త్యున్నతులకు కారణభూత మగుచు ప్రవర్తిల్లినది అట్టి ఆంధ్రపత్రికాద్వారమున పంతులుగారొనర్చిన దేశసేవ వర్ణనాతీతము గాంధీమహాత్ముడు బయలుదేరి తన సత్యాగ్రహోద్యమమును ప్రకటించినప్పుడును, తన సహాయ్యనిరాకరణోద్యమమును వెలువఱచినప్పుడును, తన బహిష్కారణోద్యమమును వ్యక్తపఱచినప్పుడును మహాత్మునికి బాసటయై నిల్చి వారియాదేశములను ప్రజలకు విస్పష్టముగ విమర్శించి చెప్పుచు, రాష్ట్రీయుల దేశాభిమానపూరితులుగ నొనర్చుటలో నాంధ్రదినపత్రిక పడిన కష్టము - చూపిన త్యాగము - చేసిన పరిశ్రమ - ఆంధ్రదేశమున్నంతకాల మాంధ్రులు మఱువవలసినది గాదు ఆపత్రికలోనే రెండుపత్రములు యింగ్లీషుభాషలోకూడ ముద్రించి దైనిక ఆంగ్లపత్రిక లేసిలోపమును పూరించిరి మొదట కొన్ని మాసములు పిదప నది మానిరి

## భారతి – సచిత్రమాసపత్రిక

మానవునకు దేశసేవ యెట్టిదో, సారస్వతసేవకూడ నట్టిదే సర్వజీవహాంతకుడైన మృత్యువు దేశసేవకుని- సారస్వత

సేవకుని దరిజేర లేఁడు అమృతమయములైన వీరిజీవితములు మృత్యుసందర్శనమాత్రమున నంతమొందవు అజరామరములై-అమర్త్యులై-నిత్యయౌవనశోభలతో వెలుగొందు దేశ, సారస్వతసేవకుల మృత్యువేగాక-కాలముకూడ నిర్జింపలేదు వ్యాస మహర్షి యేనాటికవి వాల్మీకమహర్షి యేయుగపురుషుడు శ్రీరాముడు మాంధాతాది మహీపతులేకాలమువారు వీరలకు మరణమున్నదా? సారస్వతసేవకునకు, దేశసేవకునకు మరణములేదే మరణము రాదే మార్కండేయునివలె చిరజీవులు, హనుమంతునివలె నిత్యబ్రహ్మచారులు ఆచంద్రతారార్కముగ వర్ధిల్లు సారస్వతసేవకులకంటె ధన్యజీవులు వేరెవ్వరు? త్రిభువనము లున్నంతకాలము ప్రవర్ధిల్లు దేశసేవకులకంటె పుణ్యజీవు లెవ్వరు? సారస్వతసేవయే దేశసేవ

పంతులుగారు జిజ్ఞాసువులు సారస్వతసేవ ప్రధానముగ జేసికొని సర్వవిషయముల తెలిసికొన ప్రయత్నించెడి వారు రచయితల బహూకరించియు పండితుల నారాధించియు, విజ్ఞానుల బూజించియు జీవితము గడుపనెంచినవారు పంతులుగారు అట్టికోటికి నెలవేయుటకై యొకసచిత్రమాస పత్రికను భారతి యనుపేరున ప్రకటింప జొచ్చిరి ఇం దమూల్యములగు వ్యాసరాజములు పెక్కులు ప్రదర్శింపబడుచుండెను చిత్రకళారాధకుల చిత్రములు కూడ ప్రకటింపబడుచుండెను

నాగేశ్వరరావుగారు

భారతీపత్రికాస్థాపనమునకు ముందే ఆంధ్ర దేశమునం దొక చక్కనైన ఆంధ్రమాసపత్రిక శారద యనుపేరుతో శ్రీ కొలా శ్రీరామశాస్త్రిగారిచే ప్రకటింపబడుచు వచ్చినది ఆపత్రిక ప్రజామోదమును బడసినది

ఆపత్రిక బ్రదికిన స్వల్పకాలములో జేసినసేవ యపారము శారదపత్రిక చక్కనైన పద్ధతులలో నడపఁబడుచు పరితుల కమూల్యమగువిషయముల నొసంగుచు వచ్చినది అట్టి శారద మంచియభివృద్ధిలో నున్నకాలములో భారతి 1924 సం॥రమున నెలకొల్పబడినది కార్యమందున దక్షత, దక్షతకు తగిన ధనము, ధనమునకు వలసిన యుత్సాహము, ఉత్సాహమునకు వలసిన యోర్పు, ఓర్పునకు నరివడు శాంతి, వంతులు గారిలో సంపూర్ణముగ ఘనీభవించియుండుటచే భారతిని అభివృద్ధిపఱచుట ప్రారంభించిరి చదువరుల నాకర్షించు చిత్రములు, చిత్రములకు తగిన రంగులు, రంగులకు వలయుధనము, వెచ్చించుచు వచ్చిరి మంచిగ్లేజుకాగితముపై ఉత్తమపండితుల వ్యాసములు, మంచి ఆర్టుపేపరుపై బహువిధచిత్రములు, చక్కని బైండింగు, భారతిని యుత్తమశ్రేణి సచిత్రయాంధ్రమాసపత్రికగ తయారొనరించినది ఈవిధమున విశేషవ్యయమున కంగీకరించి పట్టుదలతో పనిచేయుట భారతి యభివృద్ధికి మూలకారణము భారతి యభివృద్ధియే, శారదపతనమునకు కారణమైనదని లోకము తలంచినది

పంతులుగారు భాషాసేవనిమిత్తమై భారతిని యుపయోగించెడివారు భాషాసేవయే వారియాశయము పరమావధి యనికూడ తలంపవచ్చును పంతులుగారు భారతిని నెలకొల్పుటలో భిన్నాభిప్రాయ ముండియుండ, శారదయందు వారి కయిష్టముగాని శ్రీరామశాస్త్రి గారితో ప్రత్యేకించి భాషాభివృద్ధినిగూర్చిన భిన్నాభిప్రాయములుగాని లేవు పంతులు గారికి కలిగినన్ని సౌకర్యములు వయఃపరిపవలసినంత ధనమున్నట్లుగా, శ్రీరామశాస్త్రిగారికి లేకపోవుటయే శారద పతనమునకు కారణముగాని వేరేమి గాదని చెప్పవచ్చును

## వీ రి రా జ కీ య ము లు

స్వాతంత్ర్యదేశమందలి రాజకీయాందోళనములు వేరు పరరాజ్యపరిపాలనాభారమును వహించు రాజ్యములలోని రాజకీయాందోళనములు వేరు "ఈయాందోళనము నిప్పుతో చెలగాటము త్రాచును తలక్రింద నుంచుట మృత్యుదంష్ట్రిల నూడ బెరుకయత్నించుట సుఖమునయున్న ప్రాణమును దుఃఖమున బెట్టుకొనుట" యని పెద్దలందురు కాని యీనాటిరాజకీయవేత్త లీబిరుదావళి కంగీకరింపరు దేశసేవ పరమాత్మసేవ వంటిదని తెల్పుదురు ధర్మప్రతిష్ఠాపనకై ప్రాణార్పణములు సేయుట తగనిపని గాదని గీత లుపదేశించుచున్న వందురు.

ఎవ రేవాదము లాడినను సత్య మొక్కటి యున్నది ఈరాజకీయాందోళనము మహాసాగరఘ ధనము కంటకావృతమార్గమున గాఢాంధకారబంధురమైన ఘోరరాత్రినికాలినడక ప్రయాణములు త్రాచుపాములమధ్య తందనాల చిందులాటలు ఇట్టిదు ఖైకజీవితమును గడుప సాహసించిన వారికే రాజకీయాందోళనములు

ఇట్టికష్టములకు దల నొగ్గ దలచియే పంతులుగారు రాజకీయములలో నడుగు పెట్టిరి వృత్తితో, ధనముతో, వయస్సుతో, నిమిత్తము లేకుండ నగ్ని, తాకినవారి నెల్ల దగ్ధమొనర్చి తీరును అట్లే వృత్తితో ధనముతో వయస్సుతో నిమిత్తము లేకుండ బంతులుగారీరాజకీయములవలన నగు నకలవిధబాధల నొందిరి షష్టిపూర్తియుత్సవముతో గారాగారప్రవేశమహోత్సవమా? ధనరాసులపై బండుకొన గలిగిన వారికి దమ్మిడీకి గతివా? ఇష్టమృష్టాన్నభోజనసంతుష్టులు కాజాలినవారికి దేవతాపులుసుతో నన్నమా? వందలాది కాజ్ఞల నిడి పనిచేయించుకొన గలిగినవారు, కూసీనేరమున కఠినశిక్షబడి, చావు తప్పించికొని, కడమకాల మంతయు గారాగారములో గడపుకొను, శాస్త్రోక్తవాగ్ధరుగారి, యదుపాజ్ఞలకులోబడి యుండవలెనా? కాలము, కాలమాహాత్మ్యము చక్రవర్తులకే తప్పని యిక్కట్లు, సామాన్యులకు దప్పునా?

1934 లో బంతులుగారు కాంగ్రెసు పార్లమెంటరీవారి యాజ్ఞానుసారముగ ఢిల్లీలోని సెంట్రల్ లెజిస్లేటివ్ ఎస్సెంబ్లీకి అభ్యర్థిగా నిలిచి 25000 ఓట్ల తేడాతో విజయ మొందిరి కొలదివత్సరము లందుండియు ననారోగ్యస్థితిచే దమపదవినుండి విరమించుకొని వచ్చివేసిరి ఇట్టి రాజకీయములు సుఖదాయకములే కాని కాంగ్రెసు అట్టిసంస్థ కాదు ప్రభుత్వమునకు సంపూర్ణముగ వ్యతిరేకవర్గములోనిదే కాంగ్రెస్సు అందుచే కాంగ్రెసు రాజకీయవేత్తలస్థితిగతులు వేఱు

గాంధీగారి సత్యాగ్రహోద్యమ మనిన బంతులుగారి కభిమానము మెండు కాంగ్రెస్సునందు వీరు రాష్ట్రమునకు సంబంధించిన పదవుల నన్నిటిని స్వీకరించిరి కాంగ్రెస్ ఆజ్ఞల శిరసా వహించుటచే బంతులుగారు ప్రభుత్వవర్గములోనివారికి శత్రుకోటిలోనివారైరి

ఉప్పుసత్యాగ్రహకాలమున వీరు చేసినసేవ యపారము వీరు తమవయస్సును, ఆరోగ్యమును నరకుసేయక లవణసత్యాగ్రహోద్యమమం దుత్సాహపూర్ణులై సుఖదుఃఖముల కెదురు సూడక పాల్గొనిరి ప్రభుత్వ మది సహింప లేదు వంతులు గారిని బట్టుకొనిరి నేరము విచారింప బడినది ఆఱుమాసములు వఱకు కారాగారవాసముకై రాయవెల్లూరు ప్రయాణము - అన్నియు నొకేదినమున జరిగినవి అది

నాగేశ్వరరావుగారు

21_4_1930 తేది తిరిగి 1932 లో కారాగారవాసశిక్ష ననుభవించిరి పంతులుగారు చెఱలోనున్న దినములు ఖైదీలకు పండుగదినములు వీరిగడపుకాలమంతయు వెల్లూరులోనే గడపిరి అక్కడనే వీరిసాహచర్యము నాకు లభించినది పంతులుగారి యాదరాతిశయములు దశదిశలకు బ్రాకినవి

అజీర్ణరోగికి యన్న మనవసరము ఆకలి గొన్నవారికే యత్యవసరము చెఱలో నిడుమలబడువారికే సాహాయ్య మవసరము ఇందలి యథార్థమును బంతులుగారు గుర్తించినారు అవసర మున్నవారికి వారు లేదన లేదు ఎవ్వరి కేవిధమగు నవసరము వచ్చినను పంతులుగారు ముందునకు వచ్చి యెంత సొమ్మైన వెచ్చించి తాను సద్వినియోగము జేసితినని సంతోషించెడివారు ఇచ్చువారే దైవకృపను దెచ్చుకొనువారు

పంతులుగా రాఱుమాసములు రాయవెల్లూరు జెయిలుఖందు దవ మాచరించి వెలుపలకు వచ్చి ద్విగుణీకృతోత్సాహులై ప్రకాశించిరి

## వీ రి సం ఘ సే వ

సంఘమునందే బలము గలదు సంఘమునందే దైవము గలదు సంఘసేవయే దైవసేవ దైవముగూడ దనసేవకుని

కంటె సంఘసేవకుని గౌరవించునని చదువుకొనియున్నాము సంఘసేవను మించిన సేవ లేదు

పంతులుగారిసంఘసేవ పార మెఱుగదు వీరికాలములో వీ రధ్యక్షత వహించని సభలు, తెరువని గ్రంథాలయములు, ప్రోత్సహించని కళాపరిషత్తులు, దాన మొసగని జాతీయవిద్యా సంస్థలు నాంధ్రదేశమున లేవనియే చెప్పవచ్చును వీరి నాశ్ర యించినసంఘమువా రెంతటి కుగ్రామవాసులైనను బ్రయాణ కష్టములకు సంశయింపక వెడలి సభను దిగ్విజయముగా గొన సాగించు చుండెడివారు ఆంధ్రదేశమందలి పెక్కుగ్రంథాలయ ములకు వీరిపేరే పెట్టిరి బందరు జాతీయకళాశాలకు భూరివిరా ళము లిచ్చి కళాశాలను బోషించుటయేగాక యచ్చట బని చేయుచున్న ప్రమోద కుమార ముఖర్జీగారికి నెలకు నూఱు రూపాయలు జీతముచొప్పున నొక్కసంవత్సరము వేతన మిచ్చి యున్నారని రామకోటీశ్వరరావుగారు తెల్పియున్నారు పెక్కు గ్రంథాలయములకు వీ రాంధ్రపత్రిక నుచితముగ నొనగుచుండెడివారు ఎవ్వ రేగ్రంథమాల బెట్టినను వీరు మహారాజపోషకులే ఎవ్వ రేగ్రంథాలయము బెట్టినను తొలి దానము వీరిదే రవిభటసంఘమునకును, క్రొత్తపట్టణములోని యార్థిక రాజకీయ శిక్షాశిబిరమునకును మఱియెన్నియో యువజనసంఘములకును భూరివిరాళముల నొసంగిరి మార్దంగి

కాచార్య అశ్వధాటి రామమూర్తికి షష్టిపూర్తియుత్సవమును వీరే జరిపిరి వీరిసాహాయ్యము బొందనిసంస్థ యాంధ్రదేశమందు లేదని చెప్పుట సాహసము కానేరదు 1926 సం॥రమున రాజమహేంద్రవర హిందూనాటకసమాజమువారు నాప్రథమదృశ్యకావ్యమగు ప్రతాపసింహము బ్రదర్శింప సమకట్టిరి అప్పుడు పంతులుగారి యధ్యక్షతక్రింద నాప్రథమప్రదర్శనమును ప్రదర్శింపజేయుట యుక్తమని తోచినది నాటకసంఘాధికారి పంతులుగారి కీవిషయమంతయు దెల్పిరి పంతులుగా రంగీకరించిరి ప్రదర్శనమునకు వలయుయత్నములు సంపూర్ణములైనవి

నాడు విజయదశమి ప్రతాపసింహ ప్రథమప్రదర్శనమానాడే - సర్వ మాయత్తమై పంతులుగారిరాకకై యెదురు చూచుచుండగ నాఖరి రైలుగూడ వెడలిపోయినది - పంతులుగారు రాలేదు పంతులుగారు రాకుండ నుండువారు గారు కారణ మేమైయుండునా యని వితర్కించుకొనుచుండగ - ప్రదర్శనము ప్రారంభింపక తప్పినది గాదు కొంచెము కాలహరణము గావించినను పంతులుగారు వచ్చుటకు వలయు సౌకర్యములు లేవు - కారుపై యెకాయెకిగ వచ్చుటకైన గోదావరిని దాటవలసియున్నది అది దుర్లభము - పైగా ప్రదర్శనాపేక్షులై వచ్చిన ప్రేక్షకవర్గమం దాందోళనము పెరి

గినది ఇది యెల్ల విలోకించి ప్రదర్శనమును ప్రారంభించిరి మరి పదినిముషములకు పంతులుగారు రంగస్థలములోనికి వచ్చిరి వారిని చూచినవారు ఆశ్చర్యచకితులైరి బెజవాడలో వీరికి రైలు మించిపోవుటయు, తిన్నగా తమకారుపైననే కొవ్వూరువఱకు వచ్చి, అక్కడ ప్రత్యేకముగ నావ కుదుర్చుకొని యారాత్రి గోదావరిని దాటి జట్కా చేసుకొని ప్రదర్శనశాల వద్దకు వచ్చుటయు మొదలగుచరిత్రను రంగస్థలమునుండి పంతులుగారే సెలవిచ్చిరి నాకు వారితో స్థిరపరిచయము గలుగుటకు ప్రారంభ మానాడే ప్రదర్శనానంతరము సమాజము వారికి నూట పదియారురూపాయలు బహుమాన మొసగి పంతులుగారు వెడలిపోయిరి

## వీ రి దా తృ త్వ ము

దాతృత్వము మానవుని కుత్తమలక్షణములలో నొక్కటి పంతులుగారి కది యుగ్గుతో పెట్టబడిన లక్షణము వీరు స్వగ్రామమైన యెలకుర్రులో లోవరు సెకండరీపాఠశాల నెలకొల్పి దానికి శ్యామలాంబావిద్యాలయ మని పేరు పెట్టిరి గొప్పరాజకీయవేత్తయయ్యు మిక్కిలి బీదవాడయిన శ్యామసుందరచక్రవర్తికి వందలాదిగ ధన మొసంగి యాతనిహృదయమునకు స్వస్థత చేకూర్చిరి 1914 సం॥ లో రాజకీయకుట్ర

నేరము మోపవలెనని కొందరు యువకులను (అనగా యిద్దరు ఆంధ్రులు ఒక గుజరాతీయుడు - ఒక మహారాష్ట్రుడు - ఇద్దరు వంగదేశీయులను) పట్టుకొని యీ ఆర్గురను బొంబాయి తీసుకొనివచ్చి బాధలు పెట్టుచుండగా పోలీసుకమీషనరు ఆఫీసునకు వెడలి ఖైదీలను జూచుట కనుజ్ఞను బుచ్చుకొని వారికి వలసిన ధనమును, గావలసిన యితరసాహాయ్యమును బూర్తిగా నొసంగిరి ఏవిద్యార్థియైన జదువుకొనుటకు డబ్బు కావలెనని పంతులుగారిని దర్శించెనా వానికి లేదనకుండ బంతులుగారొసంగెడివారు కృష్ణజిల్లాలోని కృత్తివెన్ను గ్రామములోని దేవాలయము శిథిలమై జీర్ణావస్థలో నుండగా బంతులుగారు విశేషధనమును వెచ్చించి యీ యాలయమును బునరుద్ధరించిరి పాఠశాలాభవననిర్మాణములకు దేవాలయప్రతిష్ఠలకు జీర్ణదేవాలయోద్ధరణములకు వసతికై కట్టు గృహనిర్మాణములకు వివాహాదిశుభకార్యములకు బంతులుగారెంత సొమ్మొసంగిరో తెలియదు వ్యాసములవంక బండితుల కొసగిన ధన మపారము కవిసార్వభౌముల కొక ముద్రాక్షరశాలనే యొసంగి వైచిరి

వీ రాచేతితో వ్యయ మొనర్చిన ధనము వీరి కచ్చేరీ ఖాతాలలో నిక్కడ ఖర్చు వ్రాయబడినది చిత్రగుప్తుని చిఠాలో వీరికాతా కది జమకట్టబడినది విదేశప్రయాణికుల

లక్షణ మిదియేగదా ఇక్కడి బ్యాంకిలో నిచ్చి యింగ్లాండు, అమెరికాబ్యాంకులలోనుండి రాబట్టుకొనుట విదేశయాత్రా పరులకు సహజలక్షణము ఈవ్యాపారమర్మముల బాగుగా తెలిసిన పంతులుంగా రానియమములమీదనే నడచిరి ఈవితర ణమే వీరిని విశ్వదాతనామమున కర్హులుగ జేసినది

వీరు దాతలగుటకు పెక్కు కారణములు గలవు మో మోటమున కోడి యిచ్చుట, ఒనుగుదలపై వదిలిపించుకొను టకై యిచ్చుట, కోపము వచ్చి యిచ్చుట మొదలగు పెక్కు లక్షణములతోగూడిన కారణములు గలిగి దాతగా చేయబడు దురు అట్లే వీరికి దాతృత్వ మలవాటై పోయినది పెక్కండ్రు దాతృత్వము చిత్రికళగ నుపయోగింతురు పంతులుగారు దాతృత్వమును చిత్రికళవలె నక్రుతుగాగాక నిత్యజీవితము లోనిదే పరమార్థమన్న ట్లుపయోగించిరి

## ఆంధ్రోద్యమము

పంతులుగా రాంధ్రోద్యమమువిషయములో మంచి శ్రద్ధ గలిగి పనిచేయుచు వచ్చిరి వీరు పనిచేయుటయే గాదు వీ రాంధ్రోద్యమమునకు బ్రారంభకులనికూడ జెప్పవచ్చును వీరిప్రథమసంవత్సరాదిసంచికలో "ఆంధ్రులు 2 కోట్లకు పైగా గలరు. వీ రన్నిరాష్ట్రములందును వ్యాపించియున్నారు. వీరల

నందఱ నేకీభావులుగ జేయుట కాంధ్రభాషకు శక్తిసామర్థ్య ములు గలవు ఆంధ్రులు మిగిలిన హైందవులవలె వర్ధిల్లుచున్నా రనుట నిర్వివాదాంశము కాని వంగ మహారాష్ట్ర ఘూర్జర ద్రావిడాది దేశీయులచే దమజనబాహుళ్యమునకు దగినటు లభి వృద్ధి చెందుచున్నట్లు తోపదు ద్రావిడులును మహారాష్ట్రు లును ఘూర్జరులును నాంధ్రులకంటె సంఖ్యాబాహుళ్యమున దక్కువగ నున్నను శక్తిసామర్థ్యములం దాంధ్రులను మించి యున్నారు దీనికి ముఖ్యకారణము వారివిద్యాభివృద్ధి తెలుగు దేశమునందు దక్షిణదేశమునకంటె గళాశాలలును బాఠశాల లును దక్కువగ నున్నవి చెన్నపురియందు దేశీయులచే బ్ర చురింప బడుచున్న ఆంగ్లేయ దైవిక వార్తాపత్రికలు మూడును నాంధ్రేతరులచే బ్రచురింపబడుచున్నవి ” అని వ్రాసియున్నా రు దీనినిబట్టి యాంధ్రరాష్ట్రావశ్యకతనుగూర్చి వీరు తెలిసి కొని యాయుద్యమమునకు దారితీసినవారిలో ముఖ్యులని చెప్పవచ్చును వీరిసదాశయముల గుర్తించియే వీరి నాంధ్రులు 1919 సంవత్సరమున గుంటూరులోని ప్రత్యేకాంధ్రమహాసభ కధ్యక్షులుగ నెన్నుకొనిరి 1924 సం॥రమున మద్రాసులో జరిగిన యాంధ్రమహాసభయందు వీరికి దేశోద్ధారకబిరుదము నిచ్చిరి 8 సెప్టెంబరు 1929 సం॥రమున వీరి నాంధ్రులందఱు గలిసి సన్మానించిరి

పంతులుగారు హిందూస్థాన్ బ్యాంకి ఫౌండరులలో నౌకరు దానికి డైరెక్టరుగాకూడ నుండి పనిచేసిరి ఆబ్యాంకికి మూలాధారమే పంతులుగారని కొందఱు పెద్దలు తెల్పుదురు

## వీరిగ్రంధపరిశ్రమ

వీరు బహువిధగ్రంథముల జదివిరి పెక్కింటికి పీఠికలు వ్రాసిరి వీరిగ్రంథములలో నాంధ్రవిజ్ఞానసర్వస్వ ముత్తమమైనది ఆంధ్రగ్రంథమాల యనుపేరున గ్రంథముల బ్రకటించిరి ఆగ్రంధమాలలో నిది యొకగ్రంథము రెండుసంపుటములుగ బ్రకటింపఁబడినది ఈరెండుసంపుటముల వెల రు 20—0—0 లు ఇదియేగాక యిట్టిగ్రంథములు పెక్కులు ప్రకటింపబడినవి పాల్కురికి సోమనాధకవి ప్రణీతమైన పండితారాధ్యచరిత్రమును బసవపురాణమును వీరు చక్కగ బరిశీలించి ముద్రించి ప్రకటించియుండిరి ప్రతిసంవత్సరమున నుగాదినంచిక 200 పేజీలగ్రంధము మంచిమంచి వ్యాసములతో బలువిధచిత్రములతోఁ బ్రకటింప బడుచున్నది ఈ గ్రంధజాలము నంతను మించిన యుత్తమగ్రంథము భగవద్గీతాభాష్యము పంతులుగారికి దేశభక్తియేగాక దైవభక్తికూడ బరిపూర్ణముగ గలదు వీరికి భగవద్గీతలు నిత్యపఠనీయగ్రంథము, అర్జునునకు ధర్మసందేహ ముద్భవించినపుడు శ్రీకృ

ష్ణుడు చెప్పిన వాక్యములే భగవద్గీతలు సారవంతములు ఉప నిషదర్థభూయిష్ఠములు సాధారణుల కవి యగ్రాహ్యములు అందుచే నాగీతలకు బ్రత్యేకవ్యాఖ్యానములు బయలుదేరినవి ఈవ్యాఖ్యానకర్తలలో ముఖ్యులు శ్రీశంకరభగవత్పాదుల వారు వీ రద్వైతపరముగ గీతాభాష్యమును రచించిరి పిదప శ్రీ రామానుజాచార్యులవారు విశిష్టాద్వైతపరముగ భాష్య మును రచించిరి వీరిపిదప మధ్వాచార్యులుగారు ద్వైతపర ముగ భాష్యమును రచించిరి కడపట శ్రీ బాలగంగాధరతిలక్ మహాశయుడు వేఱొక గీతాభాష్యమును రచించెను పంతులు గారుకూడ వేఱొక్క భాష్యమును వ్రాసి ప్రకటించిరి మహా సముద్రము పాత్రోచితజలము నొసంగినట్లే భగవత్ప్రసాద మైన గీతాభాష్యకర్త బుద్ధిసూక్ష్మత గ్రహింప గలిగినంత రహస్యమునే యొసంగుచుండును ఈగ్రంథరచనమునుబట్టి పం తులుగారి దైవభక్తి యాస్తిక్యబుద్ధి ద్యోతకము లగుచున్నవి

## బెజవాడ

చాలకాలముక్రిందట బంతులుగారు బెజవాడయందు నివాస మేర్పఱచుకొన దలచిరి ఒక్కనివాసమే గాదు ఆంధ్ర పత్రికను మదాసునుండి మార్పవలెననికూడ వారు తలంచు కొనిరి ఇందులకు గారణము ఆంధ్రరాష్ట్రమునకు బెజవాడ

ముఖ్యపట్టణమగునని వీరికి నమ్మిక యుండెడిది పంతులుగా రాంధ్రరాష్ట్రనిర్ధారణమునకు జేయుచున్న కృషికి ఫలితముగా బెజవాడ రాజధాని యగునని తలంచిరి మద్రాసులోనున్న సౌకర్యములన్నియు బెజవాడ వచ్చినగాని దినపత్రిక ముద్రింపించుట కవకాశ ముండదు అందుచే బంతులుగారు వార్తా సంఘమువారిని బ్రశ్నింపగా వారు బెజవాడలో నొక ప్రత్యేక కార్యాలయము బెట్టి పంతులుగారికి వార్తల నంద జేయుట కంగీకరించిరి ఆకారణమున బంతులుగారు బెజవాడలో భవన నిర్మాణమునకు బ్రారంభించిరి వారి కొక వసతిగృహము, పత్రికాలయమున కొక ప్రత్యేక భవనము కట్టిరి వీనికి వేలాదిగ ఖర్చైనది తుదకు వార్తాసంఘము వారు ప్రత్యేక కార్యాలయమును బెట్టివార్తలనంద జేయుట కవకాశముండదని తెల్పుటచే బంతులుగారా యుద్యమమును విరమించుకొనిరి వసతిగృహమున వారే కాపుర ముండుటకును, వేఱొక భవనమును దుర్గకళామందిరమును బెట్టుటకును నిశ్చయించుకొని యట్లుచేసిరి ఆవసతిగృహమునందే తమకూతునకు 2–5–1928 సం॥ రం తేదీని మహావైభవముగ నెనుబది వేలు వెచ్చించి వివాహము గావించిరి

## శ్రీ బాగు

శ్రీబాగుభవనము మద్రాసులో మైలపూరునందు లజ్ చర్చిరోడ్డులో పంతులుగారి వసతిగృహము ఈభవనము

కొన్ని యెకరముల స్థలములో గట్టఁబడిన విశాలమగు రమ్యమైన దివ్యభవనము ఈభవన మాంధ్రరాష్ట్రముయొక్క యైక్యతకు మూలస్థానమై యలరారిన దగుట చరిత్రాత్మక భవనమై యలరారినది ఈభవనములో నాంధ్రరాష్ట్రసమస్యలు పెక్కులు పరిష్కరింపబడినవి సర్కారాంధ్రులకును, రాయలసీమయాంధ్రులకును నభిప్రాయభేదములు పరిల్లినవి ఇందులకు బాధ్యులు సర్కారాంధ్రులుగాని రాయలసీమయాంధ్రులుగాని కారు రాయలసీమవారు సర్కారాంధ్రులపై నీసనమును దోియఁజూచుచున్నారు ఆంధ్రమహాసభలోని వివాదములు పెంపొందినవి ఇట్టివివాదము రాష్ట్రసిద్ధికి ప్రతిబంధకమని సర్కారాంధ్రులు గుర్తించిరి సఖ్యమునకు విశ్వప్రయత్నము గావించిరి అప్పుడే శ్రీబాగుపాక్టు పుట్టెను

## ఆ స్తు లు

అమృతాంజనము, ఆంధ్రపత్రిక తంబుచెట్టివీధిలోని యాంధ్రపత్రికాలయము, బెజవాడలోని పెద్దవనతిగృహము, దుర్గకళామందిరమును, మదాసులోని శ్రీబాగుభవనము, కృత్తివెన్ను గరిశెపూడి మాంట్లగామములలో విశేషముగా వ్యవసాయపుభూమి కలదు కూనూరులో విశాలహర్మ్యమొక్కటి గలదు

## ముగింపు

శ్రీనాగేశ్వరరావుపంతులుగా రాంధ్రులలో నొక యదృష్టవంతుడు దయాంతఃకరణుడు పంతులుగారి నెఱుగని వా రాంధ్రులలో లేరు ఆంధ్రదినపత్రికవలననో, అమృతాంజనమువలననో ప్రతియాంధ్రు డామూర్తిని కలిసికొనియే యుండును వారియౌదార్యము, వారిగుణవిశేషములు వినిన ప్రతియాంధ్రుని హృదయ మానంద మొందియే యుండును

పంతులుగారిని నేను కారాగారమున గలిసియుండు నప్పుడేగాక మద్రాసు వెళ్లినప్పు డెల్ల వారిని సందర్శించుచుం డెడివాడను వారికి నాయందుగూడ వాత్సల్యము మెండు నాకు సాముద్రిక మభిమానవిద్య యని వారికి దెలియును నా వ్యాసములు తమభారతియందు బ్రకటించుకొనుట కనుజ్ఞ నొసంగిరి వారియనుజ్ఞప్రకారము భారతిలో నొక్కసంవత్సరము నాసాముద్రికవ్యాసములు ప్రకటింపబడినవి పంతులుగారిని గలిసికొనినప్పు డెల్ల "మీవ్యాసములు నేను జాగ్రత్తగా జదువుచున్నాను మీకృషికి సంతోషించుచున్నాను మీవ్యాసములు గ్రంథరూపముగ దీసి ప్రకటించెదము" అని తెల్పెడివారు

ఆంధ్రదేశోద్ధరణకృత్యము లనేకములు వీరు చేసియుండుటచే వీరికి దేశోద్ధారకబిరుదమును 1924 సం॥రమున నాంధ్ర

మహాసభ యొనగినది వీరివితరణమునకు గాంధిమహాత్ముడు విశ్వదాత యను బిరుదము నిచ్చెను ఆంధ్రవిశ్వవిద్యాలయ మువారు వీరిపాండిత్యకి కళాప్రపూర్ణబిరుదమును 2-12-1937 సం॥రమున నొసంగిరి వీరినామాంకితముగ మాంబళమున నొకవీధి నిర్మింపబడినది జయపురాధీశ్వరులు వీరిచిత్రమును బహిరంగపఱచిరి

1937 సం॥ రమునుండియు బంతులుగారు రాజయక్ష్మ వలన బాధపడిరి పట్టణవాస్తవ్యులకు సహజముగ వచ్చు నీ వ్యాధి వయసు గడచినపిదప బంతులుగారికి వచ్చుటచే తగ్గ లేదు ది 11-4-1938 సం॥రం బహుధాన్య నామసం॥ర చైత్ర శుద్ధ ద్వాదశీ సోమవారము మధ్యాహ్నము 2½ గం టలకు బంతులుగారు లింగసాయుజ్యమును బొందిరి నాడు నేను మదరాసులో నుండుట తటస్థించినది 12-4-1938 తేదిని వారిభౌతిక దేహమును జూచుటకై వారిమిత్రులు బంధు గులు మొదలగువారు వారిని కడసారి గుర్తించిరి నేనుకూడ వెడలితిని వారిని జూచి వచ్చుటయేగాక వారిభౌతికశరీరమును మోయువారలలో నే నొక్కరుడ నైతిని అంత్యక్రియలు పూర్తి యగువఱ కచ్చటనే యుండి పిమ్మట శ్రీసాంబమూర్తి గారితో బయలుదేరి బసకు జేరుకొంటిని పరమేశ్వరుడు వారి యాత్మకు శాంతి నొసంగుగాక

## ఆంధ్రుని సంతాపము

ఈదుర్వార్త చెవిని బడినది సరిగా మూడుగంటలకు వార్త వినినవుడే గాదు, అక్కడికి బోయి చూచినపుడుకూడ బంతులుగారిమరణమును శంకింప వలసివచ్చినది

డెబ్బదియేండ్ల పండుముదునలియైనను, రెండేండ్లనుండియు ననారోగ్యపీడితుడైనను, వారిముఖము వసివాడ లేదు చెప్పలేని భావుకత్వమును, పరమాశయములను జీర్ణించుకొనిన దివ్యకళ తాండవించుచున్నది

ఏమియున్నది? అంతయు నైనది ఆంధ్రభాను డస్తమించినాడు ఆంధ్రసాహితీక్షేత్రమునకు గఱవు పట్టినది

ఎంత బిగబట్టుకొనినను తల్లియు దండ్రియు జనిపోయిన నాడుకూడ నేడువురాని నాకు ఎందులకో యప్రయత్నముగ నశ్రుకణములు రాలిపడినవి

పెద్దలు, పిన్నలు, స్త్రీలు, పురుషులు, మంత్రులు, జవానులు, అందఱును వచ్చిరి

కంట నీరువెట్టనివాడు కాన రాలేదు

ఆంధ్రులు అఱవలునుగూడ—

ఈ పిడుగువంటివార్త తెలియగనే యాంధ్రదేశమే కాదు యావద్భారతదేశముగూడ దల్లడిల్లి పోయినది

నాగేశ్వరరావుగారు

అవతారపురుషుడగు పంతులుగారి యస్తమయముతో నొకమహాజ్యోతి చల్లారినది

ఒక కల్పవృక్షము కూలిపోయినది

ఒక మధురకోమలస్వర్ణసుమము రాలిపోయినది

ఒక జాజ్జ్వల్యమాన నక్షత్ర మంతర్ధాన మొందినది

అఖిలభారతావని అంధకారావృతమైనది

పద్యము

శా॥ శ్రీశర్వాణిని జుట్టి నృత్తరచనాశృంగారియై శృంగర
ధ్యాశింజానము మువ్వలో ప్రణవనాదంబౌ వృషస్వామి
యున్ । గాశీనాధుని వంగడంబునను వంకల్లేని జాబిల్లి నా
గేశాఖ్యంబు మహస్సులో గొనెడుగా కింతేఘృణావీణయై

—విశ్వనాథ

---

# ఒక మాట

విద్య నిగూఢగుప్తమగు విత్తము ఇట్టివిద్యను బొందిన మానవుడు సర్వత్ర పూజ్యుడు. మహాదైశ్వర్యసంపన్నుని మన స్తాపము, చోరభయము, ధనాభిమానము నిజమైన విద్యావంతున కుండవు మేధావికి ధనముకన్న విద్యయే ప్రధానము

మేధావి దృక్పథము వేఱు- ధనికుని దృక్పథము వేఱు మేధావిదృష్టి ఆధ్యాత్మికసంబంధమై సృష్టిరహస్యముల దెలిసి కొని యానందించుచుండును ధనవంతుడో ఆదిభౌతిక దృష్టి గలిగి సృష్టిరహస్యముల దెలిసికొనలేక అహంకార మమకారములతో దుఃఖభాజనమైన జీవితమును జీవింపుచు విచారించు చుండును

మేధావియైనంతమాత్రమున ధనాభిలాష నశింపక పోవచ్చును ధనార్జనముగూడ జీవితసాధనముగ జూచుకొన వచ్చును అంతమాత్రమున నది దోషమని చెప్పుట సాహస మనవచ్చును పట్టాభి మేధావి అర్జనపరుడు కూడా-

౨

# డాక్టరు భోగరాజు పట్టాభిసీతారామయ్య

## మే ధా వి.

డాక్టరు పట్టాభి గుండుగొలను వాస్తవ్యుడు ఈగుండుగొలను పశ్చిమగోదావరిజిల్లాలో యేలూరుతాలూకాలోని యొక పల్లెటిగ్రామము ఈత డీగ్రామమునందు బాల్యములో నుండెడివాడు ఈతనితండ్రిగారు గ్రామకరణము మంచిపలుకుబడి గలిగి యుండెడివాడట చిన్నతనమునందు కొలదిసంవత్సరములుమాత్రమే ప్రాథమికవిద్యవఱకు గుండుగొలనులో చదువుకొనెను పిదప యేలూరులోను బందరులోను విద్యనభ్యసించెను పట్టపరీక్షలు మద్రాసులో జదివి యుత్తీర్ణుడయ్యెను వైద్యవిద్యయందుగూడ నచ్చటనే యుత్తీర్ణుడై బందరు జేరుకొని యక్కడ తనవృత్తిని నెలకొల్పుకొని యుండెను ఈత డాంధ్రదేశమందలి మేధావులలో నొకడు

### ఈ త ని బా ల్య ము

డాక్టరు పట్టాభి మొదట విశేషభాగ్యవంతుడు గాడు గుండుగొలనునందే కరిణీకముతో కాలక్షేపము చేయుచు

స్వల్పజీతముతో సంతృప్తినంది కుటుంబపోషణము చేసికొనుచు గౌరవప్రపత్తులతో జీవితమును గడపుకొనుచున్న యొక సామాన్యగృహస్థుని యింటబుట్టిన పట్టాభి సమయోచితకష్టముల ననుభవించుచు శ్రమ నొందుటకు సంశయింపక శ్రద్ధమెయి చదువుకొని వృద్ధిలోనికి వచ్చియున్నాడు బాల్యమందు కష్టనిష్ఠురము లనుభవించినవారు వయసు వచ్చినపిదప భాగ్యవంతులై పేరుప్రఖ్యాతుల గడించుకొనుట లోకసామాన్యవిషయము ఈత డేలూరులో చదువుకొనుచున్నప్పుడు విశేషమైన దుస్తులు లేకపోవుటచే కష్టపడి యీదుకొనుచు కాలక్షేపము చేసితినని పట్టాభి మిత్రులతో చెప్పినట్లు మిత్రుడు నిడదవోలు వెంకటారావు పట్టాభినిగూర్చి వ్రాసియున్నాడు పట్టాభి శ్రమనొందుచున్నను నాతని సునిశితబుద్ధి మాత్రము మొక్కవోలేదు కష్టపరంపరలచే సాన పెట్టబడి ప్రకాశించిన బుద్ధి మంచివాడి గలిగి ప్రకాశించును బాల్యదశలో మహైశ్వరవంతులై గుఱ్ఱపుబండ్లలోను మోటారులలోను పాఠశాలలకు బోయి విద్య నభ్యసించినవారు మహామేధావులుమాత్రము గాజాలక భోగలాలసులై జీవితముల బాడొనర్చుకొనుచుందురు పట్టాభి మొదటిశ్రేణిలోనికి జేరినవాడు మహైశ్వర్యవంతులశ్రేణిలోనికి మొదటి బాల్యావస్థలో జేరినవాడు కాకపోవుటచే శ్రమపడి చక్కగ జదివికొని మొదటితరగతిలో

నుత్తీర్ణుడగుచు తద్ద్వారమున వచ్చిన ధనముతో పైతరగితు లలో ప్రవేశించి చదువుకొనుచు నభివృద్ధిలోనికి వచ్చి యున్నాడు

ఏలూరునందలి పరీక్షలలో నుత్తీర్ణుడై యిక చదువు కొనుట కవకాశము లేకపోవుటచే బందరున కేగి యచ్చట నోబుల్ కాలేజీలో పైతరగతులయందు ప్రవేశించి రఘుపతి వేంకటరత్నమునాయుడుగారివద్ద చదువుటకు మొదలిడెను. ఆవిద్యాభ్యాసకాలమందు నాయుడుగారు పట్టాభియందు ప్రత్యే కాభిమానము జూపి యాదరించెడివా రట నాయుడుగారు మంచి యాంగ్లభాషాజ్ఞాని మంచి యుపన్యాసకుడు విద్యార్థుల యందు దయగలిగి వారియోగక్షేమముల నరయుచు విద్య గఱపుచుండెడివారు ఇది నాయుడుగారిలో నొక ప్రత్యేకలక్ష ణము ఇట్టిప్రత్యేకలక్షణములు గల నాయుడుగారు విద్యార్థుల నభిమానముతో జూచుచున్నప్పుడు మేధావియై శ్రద్ధాళువై చదువుకొనుచు వచ్చిన పట్టాభిపై ప్రత్యేకాభిమాన ముంచుట వింత గాదు అట్టిది లేకుండిన వింతగ నుండును 1896—97 సంవత్సరములలో ఎఫ్ ఏ పరీక్షయందు ప్రథమశ్రేణిలో నుత్తీర్ణుడై సింగరాజు సుబ్బారావుగారి స్కాలర్షిప్పువల్ల మద్రాసు క్రిస్టియన్ కాలేజీలో బి యే చదువుటకై వెళ్ళెను

ఈతడు చెన్నపట్టణము వెళ్ళునప్పటికే మంచి వ్యాక్చాతుర్యము గలిగి యుండెడివాడు తర్క వితర్కములతో సందె వేసిన చేయి హిందీ, ఉర్దూభాషలు ఆంధ్ర ఆంగ్లభాషలు నతనిజిహ్వాగ్రమందు తాండవ మాడుచుండును ఈత డన్నిభాషలలో నొకమాదిరిగా నుపన్యసింపగల శక్తివంతుడు పట్టాభి తెలుగున నుపన్యసించునపుడు పదములకై తడవుకొనుట సమయస్ఫూర్తి లేకుండుట మొదలగు లోపములు లేవు ఎట్టివా డెదురుగ నిల్చినను వానిని తనమాటలపటిమచే శక్తిసామర్థ్యములచే నోడించుచు సమయస్ఫూర్తి తొణుకు లాడుచుండుటచే సామ్యములు, జాతీయములు తమంత తాము వచ్చి యవసరమున్నచోట దొరలుచుండుటచే నెదటివానిని చిత్తుచేసిజితోస్మి యనిపింపగల మహాసామర్థ్యము గలవాడు మనపట్టాభి ఇట్లా నూరితేరిన యుపన్యాసకుని లక్షణములు పట్టాభిలో చిన్నతనముచుండియు ద్యోతక మగుచుండెను పట్టాభి పట్టి యావేశపూరితుడగు నుపన్యాసకుడు కాడు వానిలో నావేశము తక్కువ ఆర్థికశాస్త్రవేత్త కావేశ ముండదు అన్నివిషయములు సావకాశముగ చక్కగ విమర్శనపూర్వకముగ ముందు వెనుకలకు బేరీజులు వేసికొనుచు చెప్పవలసినదానిని వదలివేయకుండ నుపన్యసించుచు ననవసరమైనది చెప్పకుండ వెఱ్ఱియుత్సాహముతో నావేశముతో నొడలు మఱచి సివా

లాడునట్లుగా గాకుండ దిద్దుబాట్లు హంసపాదులు లేనివిధమున నుపన్యసించునప్పుడే యుపన్యాసకుని యుపన్యాసము రక్తి కట్టును సభ్యులానందింతురు ఉపన్యాసమువలని ప్రయోజనము శాస్పించుచు అట్టి యుపన్యాసములే వినవలయునను కుతూహలము ప్రజలకు గలుగుచుండును అట్టి యారితేరిన రూపాయకు పదియూరణాలు విలువగల యుపన్యాసకుడు మన పట్టాభి ఇట్టి యుపన్యాసకుడుగ పట్టాభి విద్యార్థిదశనుండియు వన్నె కెక్కినాడు

పట్టాభి క్రిష్టియన్ కాలేజీలో బి ఏ యం ఉత్తీర్ణుడై యం బి బి యస్ పరీక్షకు చదివి యందు విజయము నొందెను ఈతడు చదివినది వైద్యము అభిమానవిద్యలు మాత్రము దేశచరిత్ర, ఆర్థికశాస్త్రములు వైద్యవిద్యయందారితేరినవారు, దేశచరిత్రయందసమానపాండిత్యప్రకర్ష కలిగి యుండుట చూచుచున్నాము బి డి బాసు అను వంగదేశీయుడు, ఇంగ్లాండు వైద్యపరీక్షకు బోయి యచ్చట దేశచరిత్ర సంబంధమైన రికార్డుల నన్నిటి గాంచి వలసిన విషయముల సేకరించికొని నిజదేశమునకు తిరిగి వచ్చినపిదప Rise of the christian Power in India అను హిందూదేశ చరిత్రమును నొకమహోత్కృష్టగ్రంథముగా నొనరించి ప్రక

టించి దేశజుల మన్ననలకు పాత్రుడైనాడు ఆగ్రంథమును చదివినవారు 'బాసు' వైద్యుడని తలవరు ఆత డింగ్లాండున కీగ్రంథమును రచించుటకే పోయియుండునని తలంచెడివారు గూడ గలరు 'బాసు' యీచరిత్రగ్రంథమును రచించినట్లే డాక్టరు పట్టాభి 50 సంవత్సరములనాటి కాంగ్రెసు చరిత్రను రచించి ప్రకటించెను వైద్యశాఖలో పరిశ్రమచేయువారు పెక్కండ్రు దేశాభిమానపూరితులై మహాత్యాగులై రాజకీయములలో ముందంజవేయుచు కారాగారముల కేగుటకు సంసిద్ధులై యుండుట దేశమునం దెల్లెడల గాంచగలము జాతీయోద్యమము విజృంభించినపుడు మొదటి పిలుపునకు సమాధాన మిచ్చువారు వైద్యులు న్యాయవాదులకంటె విద్యార్థులకంటె వైద్యులసంఖ్య యెక్కుడుగ జాతీయనాయకులలో కనబడును ఇట్టివైద్యులసంఖ్యలోనివాడే పట్టాభి

## వి వా హ ము

కాకినాడ కాపురస్థులును, మంచి న్యాయవాదులును, గౌరవనీయమగు కుటుంబమునకు జెందినవారును నగు గంజాం వెంకటరత్నము పంతులుగారికి పుత్రికాసంతానమేగాని పుత్రసంతానము లేదట ఈవెంకటరత్నము పంతులుగారు సుప్ర

సిద్ధులగుటచే వీరివీధికే వేరెయింటిపేరే పెట్టియున్నారు అది గంజాంవారివీధి కాకినాడలో హైరోడ్డుమీదనున్న పెద్ద మసీదు ప్రక్కనుండి పశ్చిమముగా కాలవగట్టువఱకును బోవు వీధికే గంజాంవారివీధి యని పేరు

ఈ వెంకటరత్నము పంతులుగారు మంచి పలుకుబడి కలవారగుటచేతను న్యాయవాదవృత్తియందు బాగుగా రాణించినవా రగుటచేతను తమపుత్రికలను విద్యావంతులును ధనవంతులునగు వరుల కీయ సంకల్పించుకొని విశేషపరిశ్రమల జేసిరి కాని వారికంటి కానినవా రొక్కరును కనబడలేదు. అనవసరముగ తిరుగుట కార్యకారి కాదని నిశ్చయించుకొని చెన్నపట్టణమునకు వెడలి వివిధకళాశాలలలోని విద్యార్థుల నరసి యరసి తుదకు క్రిష్టియన్ కాలేజికివచ్చి యచ్చట బి.ఏ. చదువుచున్న పట్టాభిని జూచి యాతని మంచిచెడ్డల నెల్ల నెఱిగికొనిరి ధనము లేకుండుట యొక లోపము కాదనియు విద్య, కులము, గుణము నుండిన జాలుననియు నిశ్చయించుకొని వెంటనే పట్టాభికి తనకూతు నొసగి వివాహము చేయుటకు నిశ్చయించుకొని యీవార్త పట్టాభిగారిబందుగుల కెఱుక పఱుప వారును నంగీకరించిరట అప్పుడు కాకినాడలో గొప్ప వైభవముతో వివాహము జరిగినది. పట్టాభిజీవితమున కిది

యొకమార్పును తీసికొని వచ్చినది ఈవివాహముమూలమున నున్నతవిద్య నభ్యసింప వీలు చిక్కినది

## వై ద్య ము

పట్టాభి వైద్యవిద్యలో నుత్తీర్ణుడై బందరువచ్చి యచ్చట వైద్యమును వృత్తిగా జేసికొని జీవించుట కారంభించెను వైద్యమునందు పెద్దపరీక్షల నిచ్చియుండుటచే సమర్థుడైన వైద్యుడని ప్రజలు వీనియందు దాదరము జూపుచుండెడివారు త్వరలోనే ధనము విరివిగ వచ్చుట ప్రారంభమైనది అనుభవమునుబట్టి మంచిమంచి కేసులను బట్టి చికిత్సచేసి రోగులకు స్వస్థత చేకూర్చుచుండెడివారు రోగనిదానములో పట్టాభి ప్రముఖుడని బందరులోని మిత్రులు చెప్పుచుందురు వైద్యము వృత్తిగా పెట్టుకొనినను ధనార్జనమే జీవితపరమావధిగా బెట్టుకొనక, ఔదార్యమును జూపుచు కరుణార్ద్రహృదయుడని పేరు నుపార్జించుకొనినాడు వైద్యులకు ముఖ్యముగ కావలసిన లక్షణముల నిది ప్రధానలక్షణము ఈవైద్యముమూలమున నీతడు మంచియాస్తిని గడించెను పట్టాభి వైద్యవిధానమం దెట్టిలోపము లేదని పలువురు దెల్పిరి రాయవెల్లూరు జైలులో నే నీతనితో నున్నప్పుడు ఈతడు తఱచుగ వైద్యానుభవముల గూర్చి చెప్పుచుండెడివాడు మా కాచెరసాల యొక పారశాల

యైనది పట్టాభి కూరలు తెఱుగఁగట్టకై వంటశాలకు వచ్చు చుండువాఁడు ముట్నూరి కృష్ణరావు, పట్టాభి, నాగేశ్వరావు పంతులు, తిరుమలరావు మొదలగు ప్రముఖు లొక్కచో జేరు చుండెడివారు వీరు పాకశాలలో జేరి పట్టాభిని కృష్ణరావును విశేషము లడిగి వారు చెప్పినవిషయములను శ్రద్ధమొయి నాలించుచుండెడివారు ఇట్టి మహామహుల సత్కోవన్యాస ములు వినుటకు వచ్చెడి సత్యాగ్రహులు కిది యొక పాఠశాల యని సంతోషించెడివారము ఇంతమంది పెద్దల సమావేశ మొక్కచోటనే స్థిమితముగ వేఱుపని లేనిచోట దొరకుట సత్యాగ్రహఖైదీలకు గుడ్డిలో మెల్లవలె కనబడుచుండెడిది ఈ యవకాశమును పోగొట్టుకొనక యుపయోగపఱుచుకొన దల చినవారి కిది యొక విద్యాస్థానమై యలరారినది ఆనమయ మున రాయవెల్లూరుజైలులో నున్న రాజకీయఖైదీలు వీరి సాన్నిధ్యము లభించుటచే నదృష్టవంతులైరి

## జాతీయోద్యమములు

1906, 1907 సంవత్సరములలో వచ్చిన బంగాళాదేశ విభజనము మూలముగా బయలుదేరిన "వందేమాతరం" అల జడి దేశమంతటను వ్యాపించినది ఈయలజడి మనయాంధ్ర దేశ మంతకు నలముకొనినది ముఖ్యముగా కాకినాడ, రాజ

మండ్రి, బెజవాడ, బందరు మొదలగుగ్రామములలో నీసంచ లన మెక్కుడైనది ప్రజలలో నొకవిధమగు నూతనచైతన్య ముద్భవించినది దీనిపర్యవసానమున తాత్కాలికలాభ మేమి యు లేకున్నను ప్రజలదృష్టిని దేశీయవస్తునిర్మాణమునకును జాతీయవిద్యాభినివేశమునకును బురికొల్పినది ఆకాలమునందే స్వదేశీయూవుమెంటు, విదేశవస్తు బహిష్కరణముకూడ పొడ సూపినవి జాతీయవిద్యాలయములు పెక్కులు బయలు దేరినవి అట్లు బయలుదేరినవానిలో రాజమహేంద్రవరమునందును బందరునందును ప్రవర్ధమానమైనవి ఈరెండింటిలోను బందరు జాతీయకళాశాల యభివృద్ధిలో నున్నది ఇందులకు కారణము బందరు జాతీయకళాశాలకు కోపల్లె హనుమంతరావుపంతులు, డాక్టరు పట్టాభి, ముట్నూరి కృష్ణరావు, పల్లూరి సూర్యనారా యణగార్లు, కలిసి యీయుద్యమమును లేవనెత్తి యీసంస్థ జయప్రదముగ కొనసాగుటకు విశేషధనమును సమకూర్చి యీ సమకూర్చిన ధనమును జాగ్రత్తగ వినియోగపఱచుచు కళా శాలను సర్వవిధముల నభివృద్ధిలోనికి దీసికొని వచ్చుటయే అందులో పట్టాభి కొన్నినాళ్ళు పాఠములు చెప్పుటకూడ తట స్థించినదని పెద్దలు చెప్పుదురు

ఈజాతీయోద్యమము మొదట విజృంభించినదిగాని యిది స్థిరమైనదిగా నిలిచి పోలేదు వంగదేశమును విడదీసిన

కొలదిసంవత్సరములకే యావిభజనమును రద్దుచేసి మరల నొక
టిగ నొనర్చిరి అందుచే నీబంగాళానమస్య బంగాళముననే
యంతరించినది ఈయుద్యమమున పనిచేసిన యాంధ్రరాష్ట్ర
మువారు మెదుగుపొడుగులు లేక యారీతినే నిలిచిపోయినది
కాని దీనివలన దేశాభిమానులు కొందఱు, ప్రతిమండలము
నను లెక్కకు తేలిరి అట్లు లెక్కతేలుట యటు ప్రభుత్వము
నకు నిటు దేశమునకునుగూడ మంచిదైనది ప్రభుత్వదృష్టిలో
నీపని జేసినకొందఱను విరోధివర్గములో జేర్చుకొనుటయు,
దేశాభిమానుల దృష్టిలో నాప్తవర్గములో జేర్చుకొనుటయు
జరిగినది ఈక్లిష్టపరిస్థితిలో తేలిన జాతీయాభిమాను లందఱు
యావజ్జీవమును దేశాభిమానులుగనే నిలిచిపోయిరి వారి యక
లంక దేశభక్తి, నిష్కపట ప్రజాసేవ, వినిర్మల స్వరాజ్యాభి
మానము, ప్రజ కాదర్శప్రాయమై నిలిచిపోయినది మన
పట్టాభి యిట్టివారిలో నొక్కడు

## స్థానికపదవులు

పట్టాభికి స్థానికపదవులన్న తలనొప్పి మనపై విదేశ
ప్రభుత్వ మధికారములో నున్నంతకాలము మన మేస్థానము
లలో నుండినను నిక్కమైన ప్రజాసేవ చేయజాలమని యీతని
యభిప్రాయము అందుచేతనే పట్టాభి గ్రామ, మండల,రాష్ట్ర

సభలలోగాని కేంద్రశాసనసభలలోగాని ప్రవేశించ లేదు అట్లు ప్రవేశించవలయుననిన ధనము లేక తావు లేక, అవకాశము లేక, అర్హత లేక మాన లేదు వానిపైనున్న యేవగింపుచే నాత డా దరికి పోలేదు ఆప్రశంస చేయ లేదు ఆవాంఛ యాతనికి కల నైన కలుగ లేదు కాని మిత్త్రుల ప్రోత్సాహమున నతడు బందరులో మ్యునిసిపలు కౌన్సిలులో సభ్యుడుగ బనిచేసెను ఆ సభలలో విశ్వాస ముండి వెడలినవారి నాతడు వలదని వారింప లేదు కాని యాత డాప్రయత్న మెన్నడును జేయ లేదు ఆ పదవుల స్వీకరించి పనిచేయుచున్నవారికి కోరినప్పుడు సంకోచింపకుండ వారికే వలయు సాహాయ్యము నాతడు చేయుచు వచ్చెను ప్రజాపక్షమున పనిచేయువారి కాత డిచ్చిన సాహాయ్య మపారము రాజ్యాంగవిధానమును నడుపుచున్న ప్రధాన మంత్రికి దెలియని పెక్కువిషయములు పట్టాభికి తెలియును ఆదోషము లేవియో, అవి యెందుచే వచ్చినవియో కూడ సకారణముగ పట్టాభి చెప్పగల శక్తిగలిగి యుండెను ఇంతకును ముఖ్యమైన దొక్క విషయము శాసనసభలలో పనిచేయుచున్నవారికి పట్టాభి సలహాలను, సాహాయ్యమును ప్రజోపకారకములగు విషయములందే యొసంగుచుండువాడు గాని ప్రభుత్వమున కుపకరించున ట్లొసగి యుండ లేదు ప్ర సంస్థలలో గూడ నాత డధ్యక్షపీఠ మలంకరించినవాడు గాడు ఎల్లలకు

సలహాల నొసంగుటయే యాతనివని కార్యములు సక్రమ ముగ జరుగుటయే యాతని యభిప్రాయము కాని యధ్యక్ష పీఠముపై నెక్కి గద్దరించుట కాత డిష్టపడడు అట్టిదానివలన లాభ ముండదని యాతడు బేరీజు వేసినట్లు చెప్పుచుండును పట్టాభి శాసనసభ్యులకు చేసిన పనులను గూర్చి మిత్రుడు నిడదవోలు వెంకటరావు 23-7-44 ఆంధ్రపత్రికలో నీదిగువ విధమున వ్రాసియున్నాడు

"రాష్ట్రవ్యవహారసంబంధములగు చట్టములు శాసన సభలో ప్రవేశపెట్టబడినప్పుడు వానిసంబంధమగు చర్చ యీ సభలలో సాగుచున్నప్పుడు వానికి సంబంధించిన విషయముల నన్నిటిని పూర్వాపరసందర్భములను క్రోడీకరించి వివరము లతో లెక్కలతో సహా సమకూర్చుచూ ప్రజాప్రతినిధులగు శాసనసభ్యుల కందజేయు టాతనికి చాలకాలమునుండి వరిపాటి యయిపోయినది అప్పు డప్పు డప్పట్లో చెన్నపురి చట్టనిర్మా ణసభ్యులుగా నుండిన గంజాం వెంకటరత్నం పంతులు, కృత్తి వెంటి పేరాజుపంతులు, మోచెర్ల రామచంద్రరావు, శ్రీ రాజా కొచ్చెర్లకోట వెంకట కృష్ణారావు బహద్దరు మొదలైన పెద్దలు తమవాదములను బలపఱచుకొనుటకు కావలసిన సాధన సామగ్రిని పట్టాభివల్లనే పొందుచు అనేకముఖ్యవిషయములను తెలుసుకొంటూండే వారట"

## హోంరూలులీగ్గు

1917 సంవత్సరప్రాంతమందు వచ్చిన యానిబిసెంటు గారి హోంరూలులీగ్గు తిరిగి దేశమునంతను కలవరపఱచినది ఈలీగువనికూడ స్థిరమైనది కాకపోయినది ఇదికూడ నొక తరంగమువలె వచ్చి కొన్నినెలలు దేశము నలజడిపెట్టి యంత రించినది ఈయాందోళనమున పెద్దలైనవారు కొందఱే కలుగ జేసికొనుటచేతను ప్రజాసామాన్యములోనికి యీసంస్థ వ్యాపిం పక పోవుటచేతను త్వరలో నశించి పోయినది ఈసంస్థలో గూడ మనపట్టాభి యభిరుచిని జూపించి పని జేసినాడు ఈతడు జేసినపనికి బెసెంటు సంతసించినది కాని యెట్టివారు పనిచేసి నను ప్రయోజనముమాత్రము లేకపోయినది ఈసంస్థ యెంత త్వరలో వ్యాప్తిలోనికి వచ్చినదో యంత త్వరలో నశించి పోయినది కాని యిట్టి చిన్నచిన్నసంస్థలు బయలుదేరి యొక్క లాభమును మాత్రము కలుగజేసినవి అదియే దన? అప్పటికి రానున్న కాంగ్రెస్సు మహాసంస్థకు సేవకులను నిర్మాణము చేసి పెట్టినవి ఈహోంరూలులీగ్గు జాతీయోద్యమములలోని రెం డవతరంగము ఈ 1917 వ సంవత్సరములో నాంధ్రరాష్ట్ర ద్యమము తీవ్రరూపము దాల్చినది పెక్కుసభలు జరుపబడి నవి రాష్ట్రమునం దీనమన్య ప్రధానస్థానము నాక్రమించినది

ఈయుద్యమమును పురస్కరించుకొని పట్టాభి గొప్పసేవ జేసి యున్నాడు ఈయాంధ్రరాష్ట్రసమస్యలో కలుగజేసికొని పని వేయుట కిదే ప్రారంభము అప్పటినుండియు పతనినాయు కత్వమున కొంతవఱకు పని సాగినది

## జ న్మ భూ మి

పట్టాభి యెట్టి యుపన్యాసకుడో యట్టి వ్రాతకాడు ఆతని నిర్దుష్టమైన భాష పత్రికారచనమున కనుకూలమైన భాష పెక్కండ్రు విద్వాంసులచే నామోదింపబడినది పట్టాభి వ్రాత లన్నియు పత్రికాముఖమున వెలువడుచుండెడివి ఈ పత్రిక మచిలీ బందరునుండియే ప్రకటింపబడెడి యాంగ్ల వార పత్రిక ఇది మంచి చందాదారులసంఖ్య గలిగి వెలువడుచుండె డిది పట్టాభిమూలమున నీజన్మభూమి దేశములో మంచిప్రచా రము చేసినది ఈ జన్మభూమివలన పట్టాభి దేశములో మంచి ప్రచారములోనికి రా గలిగినాడు బందరునుండి బయ లుదేరిన రెండువారపత్రికలు ప్రజాదరమును బడసి వర్ధిల్లు చుండెను మొదటిది యాంగ్లపత్రిక పట్టాభిగారి జన్మభూమి రెండవది తెనుగుపత్రిక ముట్నూరి కృష్ణరావుగారి కృష్ణా పత్రిక బందరునుండి బయలుదేరిన యీరెండుపత్రికలు చేసిన

ప్రజాసేవ యపారము కృష్ణాపత్రిక ప్రజాసామాన్యమునకును జన్మభూమి విద్యార్థులకును మందిప్రబోధము కలుగజేసి చదువరుల దృక్పథమును తఱచు మార్చుచుండెడివి ఆంగ్లభాషా సాంప్రదాయానుసారముగా నడుపబడిన యీపత్రిక ప్రకోపకారియై పేరెన్నిక గన్నది

## ఈ త ని వా ద ప ద్ధ తి

ఈతడు పత్త్రికలలో వ్రాసినప్పుడుగాని యుపన్యాసములలో మాటలాడినప్పుడుగాని యేవిషయమైన రూపాయలు, అణాలు, పైసలు బేరీజు వేసినట్లు మాటలాడును రసవత్తరములైన యుపాఖ్యానములతో, చినచిన్న లబ్జులతో, మంచిహాస్యోక్తులతో, మధ్యమధ్య డోకడాలతోసహా వడ్డీకట్టి పెంచిన ఋణపత్త్రములసంఖ్యలతో నీత డుపన్యసించునప్పు డేసదయ హృదయుని మనస్సు చలించి ద్రవీభూతము కాకయుండును? లోకపరిజ్ఞానము నభివృద్ధిపఱచు నిట్టివిషయము లీతనికి కరతలామలకములు ఈయుపన్యాసములు వినువారి కీతడు వడ్డీవ్యాపారములలో, భీమావ్యాపారములలో, మారకపు రేట్లలో, బ్యాంకువ్యాపారములలో, కో ఆపరేటివు సొసైటీలలో చాల దక్షులని తోచకమానదు. ఈత డిట్టివృత్త్యా మొక్కయాంధ్రమునందేకాక యన్నిభాషలలోగూడ జూపగలడు బొం

బాయి కాంగ్రెస్సు మహాసభయం దుర్గాభాషలోను, దక్షిణ భారత హిందీస్నాతకోత్సవమందుహిందీభాషలోను, కాకినాడ కాంగ్రెస్సు మహాసభయం దాంగ్లభాషలోను చక్కగ నుప న్యసించినాడు అన్నిభాషలలో నొకేవిధముగ సరసముగ యుక్తియుక్తముగ నుపన్యసింపగలడు పట్టాభి

## ఈతడు స్థాపించిన సంస్థలు

ఆంధ్రదేశమందలి పెద్దసంస్థలలో నీతడు స్థాపించినన్ని సంస్థలు వేఱెవ్వరును స్థాపించి యుండలేదు దేశమందలి ప్రతి రాష్ట్రములోను జీవితభీమాకంపెనీలు స్థాపింపబడి పనిచేయుట, విదేశస్థులు వచ్చి యీదేశములో భీమావ్యాపారములు జేసి లక్షలాదిగ గణించి పోవుట చూచిన యీతని కాంధ్రరాష్ట్ర ములో నొక ప్రత్యేకసంస్థ నెలకొల్పవలె ననుబుద్ధి పుట్టినది అపు డొక కంపెనీ రిజష్టరు చేయించి దానికి "ఆంధ్రా యిన్స్యూ రెన్సు కంపెనీ" అని పేరుపెట్టి కోట్లకొలదిగ వ్యాపారమును సాగింపజేసెను ఇట్లే హిందూస్థాన్ ఇన్స్యూరెన్సు కంపెనీ పెట్టించెను ఆంధ్రాబ్యాంకు, భారతలక్ష్మీబ్యాంకు స్థాపించెను హిందూస్థాన్ పబ్లిషింగు హౌసును నెలకొల్పింపజేసి తన వివిధ గ్రంథముల నుచితముగ దాని కిచ్చి ప్రకటింపజేసెను ఈత నిచే నెలకొల్పబడిన యీసంస్థలు దేశమందు మిక్కిలి ప్రఖ్యాతి

వహించి దినదినాభివృద్ధి గాంచుచునేయున్నవి ఆల్ ఇండియా స్పిన్నరు ఎసోసియేషనుయొక్క యాంధ్రశాఖ, బందరు నేషనల్ స్కూలు కూడ నీతడు నెలకొల్పిన సంస్థలే

## 1920 - 21

1920 లో బయలుదేరిన గాంధీగారి సత్యాగ్రహోద్యమము దేశమునందు వచ్చిన జాతీయోద్యమము లన్నిటికంటె ముఖ్యమైనది 1906–1907 లలోని వందేమాతరం తగాయిదాలోని నాయకులును, 1916 – 1917 లలోని హోంరూలు లీగునాటి నాయకులును, కలిసి యీయుద్యమమునకు తోడుపడుటయేగాక నూతనోత్సాహముతో పెక్కండ్రు విద్యార్థులు విద్యాధికులు జనసామాన్యముకూడ వచ్చి యీసంస్థను జయప్రదముగ నడిపింప గలిగిరి ఈసమయమునందలి పట్టాభిసేవ యపారము ఈసంస్థకై యీతడు చేసిన ప్రచారమునకు పరిమితిలేదు వివిధపట్టణములకు బోయి ప్రబోధము గావించుచు సత్యాగ్రహోద్యమమునందలి లక్ష్యములను, లక్షణములను ప్రజాసీకమున ప్రచారము గావించుచు, స్వరాజ్యోద్యమమునకు గాంధిగారి యాజ్ఞానుసారము కోటిరూపాయలనిధిని వసూలుచేయుట కీతడు పాటువడెను బహిష్కరణోద్యమమును గూర్చియు, అస్పృశ్యతానివారణమునుగూర్చియు, హిందూ

మహమ్మదీయ సఖ్యతను గ్రహించియు, నాటికిలాఫత్ సమస్యను గూర్చియు, ఖద్దరుధారణమునుగూర్చియు చక్కని యుపన్యాసముల నొసంగి యాంధ్రులను లేపిన రాష్ట్రనాయకులలో నీత డొకముఖ్యుడు ఈప్రచారమును విశేషముగా సాగించినవారు చెరుకువాడ నరసింహముగారు పట్టాభి యీప్రచారమును గావించుటయేగాక గాంధీగారి ముఖ్యస్నేహితులలో నొక్కడయి క్లిష్టపరిస్థితులలోగూడ గాంధీగారికి చేదోడు వాదోడుగ నుండి యాయనమన్ననకు పాత్రుడగుచుండెడివాడు గాంధీ, గీతలకు భాష్యకర్తలలో శంకరులంతటివాడు గాంధీయుద్యమమున కాంధ్రరాష్ట్రములో నీత డూతకోల గాంధీగారి యభిప్రాయములకు భావములకు దర్పణము గాంధీగారి నూతన వసంతోత్సవమున కీతడు కోవెల

గాంధీగారి యుద్యమాభిప్రాయమును నీతడు తు చ తప్పకుండ గ్రహించగలిగి యాచరించుచుండువాడు ప్రప్రధమమున నీయుద్యమమునం దీతని కెట్టి యభిప్రాయ మున్నదో యీనాడుకూడ నట్టియభిప్రాయమే కలదు ఈత డభిప్రాయములు మార్చుకొనని రాజకీయవేత్త శాసనసభాప్రవేశాదులందు మొదట నమ్మకము లేనట్లే యీనాడును నమ్మకము లేదు ఆశాసనసభాప్రవేశమువలన దేశోపయోగకృత్యములు చేయ లేమనియు, ప్రభుత్వ మందుల కడ్డు తగులుచుండునని

యు, గవర్నర్లు, గవర్నరుజనరలు వానిని తమకు గల ప్రత్యేక మైన "వీటో" వవరువల్ల నడ్డు తగిలి భగ్నముచేయుదురనియు వానినమ్మకము ఈనమ్మక మట్లే వట్టినమ్మకమువలె మిగిలి పోలేదు 1937 సం॥రమున నెన్నికలు జరిగినవు డీని ద్ధ్వాన మునకును నిలువకుండెను ప్రయోజన మున్నదనుకొని ప్రవేశిం చినవారును ప్రయోజనము లేదని ప్రవేశింపనివారును తుద కొక్కటే చేయగలిగిరి దానిని 1940 – 41 సం॥ రమున వచ్చిన వ్యక్తిసత్యాగ్రహము ఋజువు చేసినది ప్రొఫెంబర్లు, నోఫెంబర్లు కూడ చెఱకేగి శిక్ష యనుభవించుటయే చివరకు మిగిలిన ప్రయోజన మది యొక్కటియే

మనపట్టాభి వ్యవహర్త యగుటచే కాంగ్రెసు ఉద్యమ ములో రూపాయలకు గణాంకు సంబంధించిన వ్యవహారమును తానే స్వయముగ నడవుచు పట్టాభి విశేషపరిశ్రమజేసి యొక ఖద్దరునిలయము నఖిలభారతచరఖాసంఘమువారి కాంధ్రశాఖగ నిర్మాణముచేసి పనిచేయుట కారంభించెను ఈపరిశ్రమ యనిన వీనికి చాల నభిమానము

ఆంధ్రులలో నింతటి తెలివైనవాడు, ఇంతటి వ్యవహర్త లేడని చెప్పవలెను ఈతని కున్నంత మేధాశక్తి ధీపటిమ వేఱొక్కరికి లేవు వీనికి సహకారోద్యమమునం దభినివేశము మెండు ఆయుద్యమవిధానమునుగూర్చి యీతడు విశేషపరి

శ్రమ చేసియున్నాడు వర్తకములలోని దళారీతనమును తగ్గింప వలెనన్న సహకారోద్యమముకంటె వేరొకమార్గము లేదని వీరి యభిప్రాయము వ్యాపారసంస్థ విషయములో పట్టాభికి కల ప్రత్యేకశ్రద్ధ వేరొక్కరికి లేదు సక్రమమైన పద్ధతు లపై, న్యాయములైన లాభములతో, వ్యవహారము చేయవలె నన్న నొక్క సహకారోద్యమమే అట్టి యుద్యమవ్యాప్తికై పట్టాభి కృషి చేసియున్నాడు

1928 సం॥ రములో నీతడు లింగ్విస్టిక్ లీగునకు అధ్య క్షుడయ్యెను ఈతడు కరాచీ వెళ్లినప్పు డచ్చటివారు లీతని కఖండసన్మాన మొనంగిరి ఈతడు కాంగ్రెస్సులో పనిచే యుట ప్రారంభించినప్పటినుండియు నితనికి ప్రజలసంస్థలలో పనిసేయుటయన్న విశేషశ్రద్ధ యుండెడిది అందుచే సంస్థాన ప్రజలహక్కులకై పోరాడెను ఆసంస్థ కీతడు చాలకాల మధ్య క్షుడుగ నుండెను వీరియాజమాన్యమున పెక్కు తీర్మానములు గావింపబడినవి ఈసంస్థానప్రజల నొక్కదృష్టిలోనికి తీసికొని వచ్చుటకు పట్టాభి మంచికృషి చేసియున్నాడు

పట్టాభికి వివిధభాషలలో మంచిపాండిత్యము గలదని మొదటనే వ్రాసియున్నాను ఆతడు పన్యాసకుడేగాక మంచి రచయితకూడా యని వ్రాసియుంటిని Constitutions of the world అను నొకచక్కని గ్రంథమును వ్రాసి ప్రక

టించెను The economic Conquest of India or the British Empire Ltd, Socialism and Gandhism అను రెండుగ్రంథముల వ్రాసి ప్రకటించెను ముఖ్యమైన జాతీయమహాసభాచరిత్రమును వ్రాసి గాంధీగారి మన్ననలకు పాత్రుడైనాడు

## ఆంధ్రరాష్ట్రోద్యమము

వీనికి ఆంధ్రోద్యమమునం దభిమానము మెండని వ్రాసియుంటిని ఈయుద్యమమునం దతడు 1917 సం॥ నుండియు పనిజేయుచుండెను ఆంధ్రమహాసభలకు పోయి యచ్చట నుపన్యాసముల నొసంగుచు ప్రజలకు రాష్ట్రావశ్యకతను బోధపఱచెను మొట్టమొదట యీయుద్యమము విషయములో (Armed Chair Poeiliciam) వలె ననగ సలహాదారునిగ పనిచేయుచు వచ్చినాడు క్రమక్రమముగ సభనివేశనము గలిగి పనిచేయ బ్రారంభించినాడు ఈసంస్థ ననుసరించి కొంత ప్రచారముకూడ చేసినాడు పలుతావులనుండి యుపన్యాసాదికముల చేతను, పత్రికలకు వ్యాసములమూలమునను మంచి ప్రబోధము గావించెను హిందూదేశము భాషాప్రయుక్తరాష్ట్రములుగ మారవలెనని ప్రచారము గావించినవారిలో మొట్టమొ

పట్టాభి

దటివాడు పట్టాభి ఇది కాంగ్రెస్సుసంస్థద్వారంఒన సాచరణ లోనికి తెప్పించెను

"రాష్ట్రనిర్మాణవిషయంలో భాషాప్రయుక్తరాష్ట్ర నిర్మాణం అంగీకరింపబడవలసియున్నది ప్రస్తుతం బ్రిటిషు యిండియా పదకొండు రాష్ట్రాలుగా విభజింపబడింది భాషా ప్రయుక్తకంగా అవి విభజింపబడాలని కోరడంలో మేము ఆపదకొండుసంఖ్యను వర్ధానుగుగా పెంచుతున్నాము భాషా ప్రయుక్తకంగా రాష్ట్రాలు పునర్నిర్మాణాన్ని పొందుతే యిప్పు డు వున్న మద్రాసు బొంబాయి సెంట్రల్ ప్రావిన్సస్ రాష్ట్రా లు పోతాయి వానిస్థానంలో ఆంధ్ర, కర్ణాటక, తమిళ, కేరళ, మహారాష్ట్ర, గుజరాతురాష్ట్రాలు ఏర్పడతాయి • • • • విజాతీయప్రభువులు ఇట్టి కలగాపులగపురాష్ట్రములు (చారిత్రక పురుషుడు విజయాన్ని కూర్చుకుంటూ వచ్చినతీరులో అవి యేర్పడ్డ రాష్ట్రములు) నిర్మాణములోని అవకతవకను సుల భంగా అర్థం చేసుకోలేరు ఆంధ్రులు ఒకకోటి యెన్భైవేలు మదరాసురాష్ట్రంలోను, డెబ్బయి అయిదులక్షలు నైజాం సం స్థానంలోను విడివడి వున్నారు ఒకభాష మాటాడే ప్రజల్ని ఒకే పరిపాలనావిధానంక్రిందకు తీసుకురావాలని మాకోరిక • • • • ఆంధ్రరాష్ట్ర శీఘ్రనిర్మాణానికిగాను ఏర్పడబోయే ఆంధ్రరాష్ట్రానికిని మిగిలివుండే మదరాసురాజధానికిన్ని మద

రాసే జాయింటు రాజధానీనగరంగా వుండాలని సూచింప బడింది ఇట్లే బొంబాయి, ఢిల్లీకూడా • • • ఈమాదిరిగా భారతదేశం రాష్ట్రభాషాప్రయుక్తకంగా పునర్నిర్మాణాన్ని పొందాలి పొందితేకాని భారతజాతీయత అభ్రింకమైన అభివృద్ధిని పొందలేదు" అని పట్టాభి వ్రాసియున్నాడు మరి యు వీరు "శాసనసభలలో రాష్ట్రభాషనే ఉపయోగించాలి విద్యావిధానాన్ని రాష్ట్రభాషలో జరపాలి కోర్టులలో రాష్ట్ర భాషలో వ్యవహారాలు జరపాలి కాబట్టి తక్షణమే భాషా ప్రయుక్తరాష్ట్రవిభజన చేసితీరాలి" అని చెప్పియున్నాడు కాంగ్రెస్సువారం దీనూత్రము నంగీకరింపజేసి యున్నాడు

## ఆంధ్రులకు అరవలకు మద్రాసే రాజధాని

తమిళ ఆంధ్రరాష్ట్రాలు రెండింటికికూడా మదరాసు రాజధానిగా వుండడంలోని ఔచిత్యాన్ని, అవసరాన్ని, అను కూల్యాన్ని, లాభాన్ని, ఉపయోగాన్ని వివరించుచు మద రాసు మహానగరాన్ని చీల్చి ఆంధ్ర తమిళ సోదరులకు కూము నది సరిహద్దని చెప్పినాడు ఇట్టి విభాగానికి చారిత్రికసాదృశ్యా లుకూడా చూపియున్నాడు హంగేరీ రాజధానియైన బుడా పెస్టు బడాఅనిపెస్టు అని పిలువబడే రెండునగరాలు సంపుటీ హౌరా కలకత్తాలు తిన్నవెల్లి పాలంకోటలు నదుల కవతల

యివతల వున్నట్లే ఆంధ్ర తమిళ మద్రాసు మ్యునిసిపాలిటీలు కూమునదికి అవతల యివతల వుండవచ్చునని సూచించెను ఇది వీరి ముఖ్యాభిప్రాయము రాయలసీమవారికిని కోస్తాఆంధ్రులకు రాజీ కుదుర్చుటకై యీతడు శ్రీబాగుపాక్టును నిర్మించి యుభయులకు సామరస్యము కూర్చెను

## శ్రీ బా గు పా క్టు

ఈపాక్టు 14-11-1937 నం॥ రములో శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావుపంతులుగారి యింట్లో సర్కారాంధ్రులకును, రాయలసీమయాంధ్రులకును జరిగిన సంధిపత్రం ఇందలి షరతులు —

1 విశ్వవిద్యాలయము —ఆంధ్రులలో వైజ్ఞానిక, సాంఘికైకమత్యములను పెంపొందించుటకును, వైజ్ఞానిక కేంద్రములను, ఆంధ్రదేశమున కంతకును ఉపయోగపడునట్లు చేయుటకును ఆంధ్రవిశ్వవిద్యాలయము వాల్తేరులో నొక కేంద్రమును అనంతపురములో నొక కేంద్రమును అభివృద్ధి పఱువవలెను ఇతరకళాశాలలను, తత్సంబంధమగు విషయపరిజ్ఞానమునకును కూడమగుచోట్ల నెలకొల్పవలెను

2 నీటిపారుదల —రాయలసీమ, నెల్లూరు, జిల్లాలో వ్యవసాయమును ఆర్థిక సౌకర్యములును, కోస్తాజిల్లాలతో సరి

సమానముగ శీఘ్రముగ నభివృద్ధి పొందుటకును, తుంగభద్ర, కృష్ణ, పెన్నానదుల నీటిపారుదల స్కీముల విషయములో పది సంవత్సరముల వఱకుగాని, అవసరమును బట్టి అంతకంటె యెక్కువ కాలముగాని విశేష ప్రాముఖ్య మిచ్చి పని చేయ వలయును

నీటిపంపకము విషయములో తగాదాలు కలిగినప్పుడు రాయలసీమ నెల్లూరుజిల్లాల అవసరములకు ప్రాముఖ్య మీయ వలెను ఈవిధానము నేటినుండియే ప్రభుత్వము అమలులోనికి తేవలెను

3 <u>శాసనసభ్యులు</u> —శాసనసభలలోని జనరల్ స్థానముల విభజనము జిల్లాలన్నియు సమానములను సూత్రముపై నాధారపడి యుండవలెను

వేర్వేరు ప్రాంతములకు ప్రాముఖ్యము కలుగుటకై విశ్వవిద్యాలయము, రాష్ట్రముఖ్యపట్టణము, ప్రధానన్యాయస్థానము వేర్వేరు కేంద్రములందు నెలకొల్పబడవలెను కాని అన్నియు నొకే కేంద్రమునం దుండరాదు

కావున విశ్వవిద్యాలయము యథాస్థానములో నుండుట కంగీకరింపబడియు మిగిలిన ప్రధానన్యాయస్థానము, రాజధానికి వలయు మిగిలిన కార్యాలయములు, కోస్తాజిల్లాలలోను రాయల సీమలోను నుండుటకే నిశ్చయింపబడినవి కాని యే యే కార్య

స్థానము లెచ్చ టెచ్చట నుండవలె ననువిషయములో రాయల సీమవారే నిర్ధారించి యెన్నుకొనుటకు అంగీకరించడ మైనది

అందరి అంగీకారముమీాదను యీారాజీషరతులను రద్దు చేసుకొనుట కధికారము లేదు (సంతకములు) కె కోటి రెడ్డి, కల్లూరి చంద్రమౌళి, L సుబ్బరామరెడ్డి, భోగరాజు పట్టాభిసీతారామయ్య, కొండా వెంకటప్పయ్య, పప్పూరి రామాచార్యులు, ఆర్ వెంకటప్పనాయుడు, హెచ్ సీతా రామరెడ్డి

ఈపాక్టు రాయలసీమవారి సంతుష్టికై సృష్టింపబడి నట్లు రాయలసీమ కోస్తాదేశముకన్న నెక్కుడు గుట్టలతో మెట్ట లతో నిండియున్నది వ్యవసాయమునకు పనికివచ్చు భూమి చాలతక్కువ ప్రజాసామాన్యమునకు తిండి తక్కువయని చెప్ప వలెను అక్కడ పంటసంవత్సరములకన్న కరువుసంవత్సరము లెక్కువ అందుచే వ్యవసాయము జీవనాధారముగ జేసికొని బ్రిదుకు ప్రజాసామాన్యమునకు రెండుపూటలు భోజనముసేసి సుఖించు నదృష్టము లేదు అక్కడినదులు కాలువకట్టలు లేవు వరదలు వచ్చునప్పుడు భూమి కులిగిపోవుటయు, మిగిలిన రోజు లలో నీటిచుక్కయైన లేకుండ నెండిపోవుటయు తటస్థించును. ఇట్టి నిస్సారమైన దేశమగుటచే ప్రజలబాధ లెక్కుడుగ నున్న మాట వాస్తవమే. కాని రాయలసీమ కిట్టినె సర్గికలోపము

లుండుట, కోస్తా దేశములు పాడిపంటలు గలిగియుండుట ఆయా సీమలనుబట్టి కలిగినవేగాని యెవరును బాధ్యులు కారుగదా! ఇట్టినందర్భములో కోస్తాయాంధ్రులవ రాయలసీమవారికి యొకవిధమగు అసంతృప్తి లోన ప్రబలినది ఇది అందరకును గాదు కొంతమందికిమాత్రమే అందులకే శ్రీబాగులోని వరతు లట్లున్నవి

ఆంధ్రులకు మాది యని చెప్పుకొనుట కర్హమైన సంస్థ ఒక్క- ఆంధ్రవిశ్వవిద్యాలయమేగదా అది యెచ్చట నుండవలె నను ప్రశ్నము రాగా రాయలసీమయాంధ్రులు, కోస్తావారు కలసి యాంధ్రరాష్ట్రమునకు మారుమూలగ నున్న వాల్తేరు నకు విసిరి వేయుట కంగీకరించినారు ఆనాటి యధికసంఖ్యాకుల యభిప్రాయానుసారముగ విశ్వవిద్యాలయము వాల్తేరునకే పోయినది ఇక దానిశాఖలను రాయలసీమలోకూడప్రతిష్ఠించ వలెనని రాయలసీమవారి పట్టుదిల ఇది న్యాయమైన కోర్కె కదే వ్యవసాయమునుగూర్చికూడ రాయలసీమవారి కోరిక ధర్మమైనదే "సర్వే జనా స్సుఖినో భవంతు" అను మహదాశ యముపై నాధారపడిన హిందువులకు రాయలసీమలో కఱవు వచ్చి జనము మాడిపోవుచుండగా కోస్తా ఆంధ్రులది చూచి సహించి యూరకొనుట ధర్మముకాదు కావున అట్టియుపకార మును రాయలసీమవారికి కలుగజేయుట సమంజసమే ఈ

సూత్ర మనుసరించియే లక్షరూపాయిల కరువునిధి వసూలు చేసి వారి కిచ్చితిమి

ఈ శ్రీబాగుపాక్టులోని మూడవసూత్రమైన శాసనసభలను గూర్చి ఈపాక్టులో నుదహరించిన విషయము ధర్మసమ్మతమైనది గాదు కోస్తామండలములలో జనాభా యెక్కుడుగ నున్న సంగతి లోకవిదితమే రాయలసీమలోని బళ్ళారి, కడప, కర్నూలు, అనంతపురం, చిత్తూరు వగైరా జిల్లాలలో జనాభా తక్కువ యనుసంగతికూడ లోకవిదితమే ప్రస్తుతపు శాసనసభలోని స్థానములు జనసంఖ్యనుబట్టి వచ్చినవి కాని మొత్తము స్థానములను జిల్లాల మొత్తమునకు విభజించి పంచిపెట్టలేదు అట్లు పంచిపెట్టినచో శాసనసభలలో సరియైన ప్రాతినిధ్యముండ నేరదనుసంగతికూడ లోకవిదితమే అట్టియెడ మూలసూత్రములను ధిక్కరించి శాసనసభలలోని జనరల్ స్థానముల విభజనము జిల్లాలన్నియు సమానము లనుసూత్రముపై నాధారపడవలె నని చెప్పుట ప్రజాప్రాతినిధ్యసూత్రమునకు భిన్నముగా ప్రవర్తించుట యగును గాని వేరు గాదు అందుచే శాసనసభాస్థానములు జనాభానుబట్టి విభజింపవలసిన దేగాని జిల్లాలకు సమానప్రాతినిధ్యమను సూత్రమును నంగీకరింపరాదు అట్లు చేసితిమేని నిజమైన (Democracy) డెమాక్రసీకి విరోధముగా నుండును

ఇక ముఖ్యపట్టణమును గూర్చి వ్రాయవలసియున్నది ఆంధ్రరాష్ట్రమునకు ముఖ్యపట్టణము మద్రాసే కాని వేరు పట్టణము పనికిరాదు ఇది యాంధ్రులపట్టణము ఈపట్టణమందు తెలుగు వచ్చిన ప్రజలెక్కువ అరవము కొంత మందికి వచ్చును అవసరము వచ్చినయెడల పట్టణమును చీల్చి పంచుకొనవలసిన దేగాని ముఖ్యపట్టణము మద్రాసునుండి మార్చుటకు తగిన యవసరము లేదు ముఖ్యపట్టణమునకు వలయు వసతులన్నియు మద్రాసునందే కలవు కోస్తాఆంధ్రులకు మద్రాసెంతదూరమో, రాయలసీమవారికిగూడ మద్రాసు అంతే దూరము ముఖ్యపట్టణములోని వివిధకార్యాలయములను భిన్నాభిన్నముల గావించి యొకటి వాల్తేరునందునను, ఒక్కటి గుంటూరునందనను, వేరొక్కటి కడప, మరొక్కటి యనంతపురము మొదలగు వివిధమండలములలో నెలకొల్పి జూచుట పరిపాలనాసౌఖ్యమునకు, సౌకర్యమునకు నంతరాయముల గల్పింప జూచుట యగును

రాజధానికి వలయు ముఖ్యకేంద్రకార్యాలయము నొకే స్థానమున వర్ధిల్ల వలసియుండును ఈకార్యాలయములయందలిపరిపాలనమన్యోన్యాశ్రయములైన వివిధోద్యోగకార్యాలయములపై నాధారపడినది అందుచే ముఖ్యపట్టణమునకు వలయు వివిధకార్యాలయము లొకేగ్రామమున నుండితీరవలెను అట్లు

పట్టాభి

సర్వకార్యాలయసమన్వితమైన పట్టణము రాయలసీమ యం దున్నను, కోస్తాపట్టణములయం దుంనను నొక్కచో కాని దీనికై విశేషధనము వ్యయము చేసికొనుటయేగాక సర్వవిధ ముల నందుబాటులో నుండిన మనమద్రాసును మనము నిరా కరించి వేరొక్కగ్రామమునకు పరుగెత్త జూచుట అధర్మము, అన్యాయము ఇది పట్టాభియాలోచనము కాదు పట్టాభి దృష్టి మద్రాసుపైననే నెలకొల్పబడియున్నదని మున్ముందుగనే సూచించియున్నాను ఇక యీపాట్లు మిగిలిన రాయలసీమ యాంధ్రు లందరు కలసి వ్రాసుకొనినదే పట్టాభి, వెంకటప్ప య్యలు, మోమోటమున కోడి సంతకముల గావించిరేమో? ఇది నా డంగీకరింపబడకపోయిన నరవసోదరుడగు కాంగ్రెస్సు ప్రధానామాత్యుడే యాంధ్రరాష్ట్రసిద్ధి కడ్డంకులు గల్పించు నని వీరు తలంచి యుండవచ్చును రాయలసీము వారికిని కోస్తా ఆంధ్రులకును విభేదకారణముగ సీరాష్ట్రసమస్య నెగురగొట్టి వేయవచ్చునను ప్రధానియాలోచనమును వీరు గుర్తించిరి శాసనసభాసభ్యు లీరాష్ట్రనిర్మాణము విషయములో సాయ పడుదురనియూ, సీశాసనసభ జీవించియున్నకాలము లోనే యిట్టి తీర్మానము సంగీకరింపజేసి బ్రిటిషుప్రభుత్వమున కామోదము నకై బంపిన నూతనశాసనసభలపై 'గొన్నగౌరవమునైన పుర స్కరించుకొని బ్రిటిషుప్రభుత్వము నిరాకరింపదనియూ నాటి

నాయకులు తలంచి రాయలసీమవారి యిష్టానుసారము వారి కోరికల నెల్ల నంగీకరించి సంతకముల జేసి యిచ్చియుందురు ఆ అత్యావసరసమయమునుబట్టి పట్టాభి సంతకము చేసి యుండ వచ్చును ఒకవేళ పట్టాభికి మద్రాసు రాజధానిగా నుండవలె ననునభిప్రాయము శ్రీబాగుపాక్టున కనంతరమందు ననగా మరి కొన్నిదినములకు కలిగినచో నప్పుడుకూడ నట్టియభిప్రాయము వారికి కలుగరాదు మొదట పాక్టుపై సంతకము చేసినచో పాక్టులోని షరతులకు భిన్నముగా వారియభిప్రాయములు మార్చుకొనుచుండుట ధర్మము కాదుగదా! కావున వారియభి ప్రాయములకు భిన్నముగా శ్రీబాగుపాక్టులో సంతకము చేయుట కేవలరాజకీయముగా తలంపవచ్చును ఇది రాజకీయము అవ సరము వెంబడిని తలనొగ్గుటే రాచకీయము నైతికముగ నిది యధర్మమైనను, రాజకీయముగ నిది ధర్మమే ఇదే భారతము బోధించుచున్నది పట్టాభి రాజకీయవేత్త అందుచే రాష్ట్ర సిద్ధియై ముఖ్యపట్టణనిర్మాణమును గూర్చిన ప్రసంగము వచ్చి నప్పుడు తిరిగి పునర్విమర్శనమును పెట్టుకొనవచ్చు నన్నయభి ప్రాయముతో శ్రీబాగుపాక్టుపై సంతకముల జేసిరేమో? కాకున్న రానురాను వీరు మద్రాసు రాజధానిగా నుండుటను గూర్చి యభిప్రాయముల మార్చుకొనిరేమో? ముందు వ్రాసిన వీరివ్రాతలకును, తర్వాత చేసిన శ్రీబాగుపాక్టునకును సమన్వయ

మగుట లేదు అందుచే వీరి మొదటియభిప్రాయములు రాను రాను మారినవనే తలంపవచ్చును ఈపాక్టులోని ఆఖరుషరతు "అందరి అంగీకారముమీదను యీరాజీషరతులను రద్దు చేసుకొనుట కధకారము కలదు" అనిగబా యున్నది ఈసూత్రాధారమున విడివడినపిదప మఖ్యాపట్టణమునుగూర్చి పునరాలోచన గావింప వచ్చునని తలంచి పట్టాభి శ్రీబాగుపాక్టును సమకూర్చి యుండినేమో

ఈయభిప్రాయములు నావేకాని యిందులకు పట్టాభి మొదలగువారు బాధ్యులు గారు వారివ్రాతలను చర్యలనుబట్టి నాకు తోచినట్లు వ్రాసితిని ఇందులకు పట్టాభి మొదలగువారు నన్ను మన్నింతురుగాక ఈ శ్రీబాగుపాక్టులోని షరతులు కొందరకు నచ్చకపోవుటచే నాడే వారల యసమ్మతిని దెలుపుచు వచ్చిరి మొత్తముమీద శ్రీబాగుపాక్టుసృష్టికి బ్రహ్మ పట్టాభి ఇది యాతని రాజకీయమందలి మంచియెత్తు

కాని పట్టాభి తలంచినదంతయు చేయ గలిగినాడు రాయలసీమవారికి తాను లొంగియో, లేక వారిని చేలోవు చేసికొనియో యావదాంధ్రరాష్ట్రప్రజల నొక్కసూత్రమున బంధించి ప్రభుత్వమునకు తమతీర్మానమును పంప గలిగినాడు ఇంతవఱకే పట్టాభి చేయగలిగినది - చేసినది

ఇక మిగిలిన పని చేయవలసినవాడు ప్రధానిగదా! శాసన సభాతీర్మానమును బ్రిటిషు ప్రభుత్వమునకు వెంటనే పంపుటయు పిదప నెహరో గావించిన కుంభకోణము తత్ఫలితముగా ఆంధ్ర రాష్ట్రమనావశ్యకమని ప్రభుత్వము సూచించుట మొదలగు నాంధ్రరాష్ట్రసమస్యాశేషములు అన్నియు విశాఖపట్టణమందలి ప్రకాశంగారి యుపన్యాసమునుబట్టియు, నాయకుల, పత్రికల, గగ్గోలునుబట్టియు, తేటతెల్లమయినవి ఇక నానమస్యను గూర్చి యిచ్చుట విమర్శించుట చర్వితచర్వణము

పట్టాభినిగూర్చి ప్రసంగించుచు అవటపల్లి నారాయణ రావుగారు చెప్పిన విషయములు యథార్థములు "పట్టాభిసీతా రామయ్యగారు వైద్యులు గనుక వారిలో వుద్రేకం తక్కువ ప్రతివిషయాన్ని శల్యపరీక్ష చేస్తారు ముందువెనుక లాలోచించి దిగుతారు దేనిమీద చేయివేస్తే దాన్ని జయప్రదంగా నిర్వహిస్తారు ఇంతవరకు కృష్ణామండలములోనే పనిచేస్తూ వచ్చారు అనేకవుద్యమాలను సంస్థలను జయప్రదంగా నిర్వహించుకొని వచ్చారు ఇవుడు రాష్ట్రాని కంతకు నాయకుడై సేనాధిపతిస్థానంలో వున్నారు సేనాధికారి ఆజ్ఞలను సేనలు యెట్లా నిరంకుశంగా ఆశిస్తూ వుంటవో అట్లాగే మనసేనాని ఆజ్ఞలను శిరసా వహించి వారికి చూపవలసిన గౌరవాన్ని చూపిస్తూ, ఏకనాయికత్వంక్రింద వ్యవహారించినట్టయితే మనకు

యింకా మంచిరోజులు వస్తాయి ఇట్లే ఆనాటియాంధ్రులు వీరిపై సంపూర్ణవిశ్వాసములతో నాయకత్వ మంగీకరించి పని చేసిరి ఆవిశ్వాస మీనాటికిగూడ నాంధ్రులలో గలదు ముందేనాటికినైన ఆంధ్రరాష్ట్రనిర్మాణము పట్టాభివల్లనే జరుగవలసి యున్నది అందుల కాతడే తగిన నాయకుడు మేధావి

## గుణములు

ముందువెనుక లాలోచింపని దుందుడుకు స్వభావము కాదు పట్టాభిది వెఱ్ఱియావేశముతో గొంతు చించుకొను నుపన్యాసము గాదు పట్టాభిది పిచ్చిభ్రమతో నాకాశహర్మ్యములకు సోపాననిర్మాణము సేయు వ్రాత గాదు పట్టాభిది ఉన్మాదుని యుద్ధృతి కార్యాచరణసమయమునందు కానము పట్టాభిలో చక్కగ సావకాశముగ, శాంతముగ, ముందువెనుకలు బాగుగ పర్యాలోచన నేయు కార్యదక్షత పట్టాభిది. తా నావేశము నొందకుండ పరుని కావేశము గొల్పించి ఎదిరిని వాగ్వాదములో ఉల్టా పల్టీ కొట్టించి విజయమమాత్రము తానే పొందగల శక్తి పట్టాభిది తప్పులు లేకుండ, తొందరపడకుండ, అర్థాన్వితముగ, సయుక్తికముగ, సుదోబధజనకముగ వ్రాయు లేఖకత్వము పట్టాభిది వ్యవహర్తకు కావలసిన మనోనిబ్బరము, ఆత్మవిశ్వాసము, ఖజానాదారున కుండవలసిన

సూక్ష్మదృష్టి, జాగ్రత, అభినివేశము పట్టాభిది చాణక్య, యుగంధర, తిమ్మరసులబోలి రాజకీయవేత్తయే కాని తిమ్మరుసు ఆంధ్రభూనేత కాడు యుగంధరుడు మహారాజు కాడు చాణక్యుడు చక్రవర్తి గాడు

పట్టాభి తన్ను తా గుర్తించు కొనలేకపోయినాడు గాంధీజీ పట్టాభి మేధావియని గుర్తించినాడు లోకము గుర్తించినది ఆంధ్రు లంగీకరించినారు పట్టాభిలోని మేధస్సు పట్టాభికే తెలియలేదు నివురు గప్పిన నిప్పది ఇట్లే యాతని నాయకత్వముకూడ పట్టాభి నాయకుడగుట కాశ లేదు తానవగలననుధైర్యము లేదు కాని యాతని కార్యదీక్ష, యాతని దూరదృష్టి, మనోనిబ్బరము, అసామాన్యములని యాంధ్రులు గుర్తించి యాంధ్రరాష్ట్రసమస్యాపరిష్కారమున కాతనినాయకత్వమునే కోరుకొనిరి పిదప నాత డభయహస్త మిచ్చియున్నాడు అట్లే అఖిలభారతదేశీయ మహాసభాధ్యక్షపదవికై తా నాసించలేదు ఆపదవి నందుటకై కొంత కుటిలనీతి యవసరము ఆకుటిల నీతి పట్టాభి కిష్టము లేదు అది చూపినగాని యధ్యక్షపదవులు రానేరవు అందుచే పట్టాభి యాపదవికై యాశింపలేదు

ఇదివఱలో నాస్థాన మలంకరించిన గాంధీ, జవహరు పండితుడు మొదలగు రాజకీయవేత్త లంద రీకుటిలనీతినే ప్రవ

ర్తించిరా యనుప్రశ్నము రావచ్చును, కాని దాని కొక్కటే సమాధానము ఆమహామహులు హిందూదేశమందలి ధృవ తారలు ప్రపంచనాయకు లను పేర్వడసి యంతర్జాతీయ కీర్తిని గడించుకొనిన వారు మహామహులు పట్టాభి దేశీయనాయ కుడు దేశీయనాయకు లాపదవుల నాశించునప్పుడు కుటిలనీతి కొంతయవసర ముండవచ్చును అస్వల్పముననైన నంగీకరింపని వాడే పట్టాభి

పట్టాభి యెంత అదృష్టవంతుడో అంత దురదృష్టవం తుడు దురదృష్టవంతుడు ఆంధ్రుడై జన్మించుటవ.

అదృష్టవంతుడు కాంగ్రెస్సువాడయ్యు సత్యాగ్రహి కాక పోవుటవలన

పట్టాభి ఆంధ్రులలో మేధావి ఆంధ్రవిశ్వవిద్యాలయాధి కారమున కర్హుడు ఆయదృష్ట మేనాడు పట్టునో?

ఆంధ్రు లికనైన వాసిని గుర్తించి తగినస్థానము నొసం గుదురుగాక!

## ఒక్క మనవి

ఆంధ్రరాష్ట్రమునకు మద్రాసు రాజధానిగా నుండుటనుగూర్చి పట్టాభిగారి యభిప్రాయమును తెలిసికొనవలసియుండి వారికి జాబువ్రాయగా వా రీక్రిందజాబును 22-8-45 తేదీని నాకు వ్రాసిపంపిరి దానిని యథారూపమున ప్రకటించినాను ఈక్రింది యభిప్రాయమునుబట్టి ముందుగ నే వ్రాసిన యభిప్రాయమును సవరించుకొనుచున్నాను ఇందులకు చదువరులు, డాక్టరు పట్టాభిగారుకూడా నన్ను మన్నింప ప్రార్థన

ఇట్లు,
గ్రంథకర్త

పట్టాభి

From

Dr B Pattabhi Sitaramayya,

Masulipatam 22-8-46

మిత్రమా,

మీ ఉత్తర మీరోజునే అందినది శ్రీబాగ్ ఒడంబడికలో చెన్నపట్నం ఆంధ్రరాష్ట్రమునకు ముఖ్యపట్నంగా ఉండవలెననే షరతులేదు హైకోర్టున్నూ ముఖ్యపట్నమున్నూ ఈరెంటిలో ఏదో ఒకటి రాయలసీమయందున్నూ, రెండవది కోస్తాజిల్లాలయందున్నూ ఉండవలెనన్న వీటినిగురించి నిర్ణయించుకొను మొదటిహక్కు రాయలసీమ వారికి ఉండవలెనని యున్నది

చెన్నపట్నం రాజధానిగా నుండవలెననునది శ్రీవేమవరపు రామదాసుపంతులుగారు విశాఖపట్నంలో రెండవమారు ఆంధ్రమహాసభ జరిగినప్పుడు చెప్పియున్నారు పిమ్మట ఈవిషయమై కాంగ్రెసు గవర్నమెంటులో శ్రీప్రకాశంగారు శ్రీసాంబమూర్తిగారు పట్టుబట్టారు 1938 సం॥లో మద్రాసులో సర్ S Radhakrishna గారి అధ్యక్షతక్రింద జరిగిన మహాసభలో ఇది అంగీకరింపబడినది మద్రాసుగవర్నరు

గారు Cabunit మీటింగులో దీనిని హర్షించినారు దీనిని షరతుగాపెట్టి ఆంధ్రరాష్ట్రమునడుగుట అనుచితము బౌండరీసుకమీషన్ వారు నిర్ణయించవలసిన విషయమేది మొదట మద్రాసుపట్నం ఆంధ్రరాష్ట్ర సరిహద్దులలోనికి వచ్చునని నిశ్చయించనిదే ఈవిషయం తేలజాలదు కాని రెండురాష్ట్రములకు ఒక్కటే రాజధానినగరం ఉంచవచ్చునా లేదా అను విషయమై చర్చించుటలో నేను కొన్ని సాదృశ్యములిచ్చిన మాట నిజమే అలా ఒక్కటే రాజధానినగరంఉంటే నాకు [illegible] మనకు చాలాఖర్చు కలిసివస్తుంది క్రొత్తభవనము [illegible] వ్యయపర్చ నవసరము లేదు అయితే ఖరారునామాలోనే అవార్డును పొందుపరచి ఫలానిచోట రాజధాని ఉండవలెనని చెప్పుట అసమంజసము

(Sd) భో॥ పట్టాభిసీతారామయ్య

## వీరువ్రాసిన గ్రంథములు

1911—లో Aygiene—హైజీను (Telugu)
1912—National Education
1913—Indian Nationalism
1916—Linguistic Provinces in India
1935—Hiotory of the Indian National Congress.

1936—Economic Conquest of India
1937—Constitutions of the World
1938—Gandhism & Socialism
1939—Hindu Home Rediscovered
1942—Gandhi & Gandhism

## BOOKS IN THE PRESS

(1) "Feathers and Stones"
(2) History of the Congress Vol II
(3) "I too have spun"
(4) What every young man and woman ought to know

or

BP's advice to his sons

3

# డాక్టర్ యల్లమిల్లి జగన్నశాస్త్రి
# విప్లవకారుడు

ఉద్రేకము తాత్కాలికలక్షణము ఉద్రేకము జెందిన మానవుని రక్తము వేడెక్కును అట్టుఉద్రేకశక్తిమును గలిగిన వాడు కార్యోత్సాహియై చేయుచుండును కాని యీలక్షణము తాత్కాలిక మగుటచే ఉత్సాహముకూడ తాత్కాలికమై యుండును ఈయుత్సాహ మున్నంతవఱకే మానవుడు పనిచేసి పిదప కార్యవైముఖ్యమును పొందుచుండును ఇట్లుండుట మానవస్వభావము సామాన్యమానవు లందరీవిధముననే యుత్సాహమును, నిరుత్సాహమును బొందుచుందురు ఆనిరుత్సాహము మాత్రము భీరువుని లక్షణము అట్టి భీరుత్వము లేనివాడే పోటుమానిసియై వీరు డనిపించుకొనును కాని ప్రతివీరునకును విజయము ప్రధానమేగాని అపజయము సంభవించినంతమాత్రమున నిరుత్సాహి కాడు నేడు కాకున్న రేపైన శత్రువిజయము దొరకక పోవునా యని యాశతో అనుభవసమయమున కెదురుచూచుచుండును ఈ అపజయమునకు జయము

నకు మధ్యనున్న దినములలో మానవునియం దుత్సాహము తగ్గినదని తలంపరాదు కలిగియున్న యుత్సాహమును వెలి బుచ్చుట కదను వెదకుచున్న సమయ మది యగునుగాని వేరేమియు గాదు యుద్ధకాలము దీర్ఘమైనప్పుడు విరామములుం గూడ హెచ్చుగనే యుండును అందుచే నట్టివీరులపని పరిపూర్ణముగ పరిశోధించిన పిమ్మట యాతనినిగూర్చి యభిప్రాయములు స్థిరీకరించుకొనవచ్చును

పరాధీనదేశములలో విప్లవోద్యమము పనిచేయునట్లు ధర్మసన్నములు పనిచేయవనియు, హింసయే ప్రధానముగా బెట్టుకొని వచ్చిన శత్రువుని సత్యవాక్యప్రబోధములు సాగ నంపవనియు, దేశస్థితి, స్వరాజ్యాభిమానము, జాతీయైక్యత, ఏకకార్యోన్ముఖులైన దేశస్థుల పట్టుదల, పని జేసినట్లు, వేడికోలులు, విన్నపములు, మహాజర్లు, కరపత్రములు పరులను పారద్రోల వనియు శ్రీ జగ్గన్నశాస్త్రి తలచుచు వేదిక నెక్కి చెప్పుచుండెడివాడు కొందఱుపన్యాసము లిచ్చుటలో ఘనులు కొంద రూకొట్టుటలో ఘనులు శాస్త్రి యుపన్యాసము లిచ్చుటలోనే ఘనుడు కాక చెప్పినవానిని యాచరణలో పెట్టుట కుత్సహించెడువాడు కాని ఒక్కనితో నెంత స్వల్పకార్యమైన కాదు కదా శాస్త్రికి తోడునీడలు తక్కువైనవి ఒక్కడై పోయినాడు అతనియుత్సాహము వేరొక్కనికి రాలేదు. అతని

కార్యదీక్ష మరొక్కనికి లేదు ఆతనిసాహస మింకొక్కనికి గానము నీటిలో బంతిని నొక్కినగొలదియు పైకి లేచునట్లు, మానవునికి కష్టములు వచ్చినగొలదియు నుత్సాహ మెక్కుడై యొప్పుచుండును అట్టివాడే శాస్త్రి రాజకీయములలో నీతనికి నిరుత్సాహము లేదు. 'యుద్ధవిరామసమయములోని సైనికులే యీనాటి కాంగ్రెస్సువీరులు' అని ఆతను ప్రజాసామాన్యము నకు చెప్పని దిన ముండదు శత్రువుని నిర్జించుటలో రాజ నీతియు, రాజకీయపరిజ్ఞానము ప్రధానములనియు, శత్రువు మన మనుకొనినంత తేలికిగ పోవువాడు కాడనియు నాతనిముఖ్యాభి ప్రాయములు

పట్టాభినిగూర్చి వ్రాయుచు వైద్యవిద్య నభ్యసించిన వారిలో నెక్కుండ్రు రాజకీయవేత్తలై యున్నారు చున్నారని వ్రాసితిని అట్లే యీశాస్త్రియుగూడ వైద్యమునం దీతని కెంత ప్రావీణ్యత కలదో, రాజకీయమునందుగూడ నితని కంతపాండి త్యము కలదు ఈతనికి వైద్యములో నెల కేడెనిమిదివందల రూప్యములవఱకు ఆర్జన యుండెడిది అట్టి వైద్యమును నాతడు రాజకీయములకొఱకు ఎరమించుకొనినాడు ఈనాటికిగూడ వీరి నెరిగినవారు వీరిని రావించి నాడిపరీక్షను చేయించుకొని వారు చెప్పినపద్ధతులమీాదనే వైద్యమును చేయించుకొనుచుందురు పెక్కండ్రితనిని సిద్ధహస్తుకనియు, నమృతహస్తు

విభజనము చేసితీరెదనని ఖర్జను 1905 సం॥ ములో జూలై మాసమునందు విభజనమును గావించెను ఆ సంవత్సరములో అక్టోబరుమాసమున ఆ విభజనము అమలులోనికి తేబడినది బెంగాలులోని పశ్చిమభాగము, బిహారు, ఒరిస్సా ఒకభాగము గను, తూర్పుబంగాళము, అస్సాము ఒకభాగముగను విభజింప బడి వాని ప్రత్యేకజీవితముల ప్రారంభించునని యనవి ”

పైనవ్రాసిన దంతయు బంగాళావిభజనముపై ప్రభుత్వము చెప్పిన కారణములు ప్రజాపక్షమున చెప్పువారిల కారణములుకూడ ధర్మసమ్మతములేగాని అన్యాయములని చెప్ప నావకాశము లేదు కాని ప్రజానీకము వలదన్నను చేయుట కధికారము ప్రభుత్వమునకు గలదు అందునే అది జరిగినది

ప్రజాపక్షకారణములు — బంగాళములో అంతర్వాహినియై ప్రవహించుచున్న విప్లవోద్యమము తూర్పుబంగాళము నందుకంటె పశ్చిమబంగాళమునందు హెచ్చుగ నుండుటచే ఆ రెండుభాగములకు సంబంధము లేకుండ చేయుటకుఁ ప్రభుత్వము పెట్టుకొని రనియు, వాస్తవమునకు పశ్చిమబంగాళములో విద్యాధికులు, రాజకీయవేత్తలు యెక్కుడుగ నుండుటచే నీవిద్యాధికుల బారినుండి, తూర్పుభాగమును కొంచెమనాగరిక ప్రదేశ మగుటచే దానిని సంరక్షింప వలెనను

తలంపుతో ప్రభుత్వము విభజన కేర్పాటు చేయుచున్నదనియు, పశ్చిమభాగములోకంటె తూర్పుభాగములోని ప్రదేశములలో మహామ్మదీయు లెక్కువగ నుండుటచే నీయుభయజాతులవా రైకమత్యమును నభివృద్ధిగాంచి రాజకీయాందోళనము నెక్కుడుగ జేయుదురనుభయమున నీయుభయపక్షముల విడదీసి హిందువులపైకి మహామ్మదీయులను పురిగొల్పి వీరిద్దరి వివాదముల ప్రయోజనము ప్రభుత్వము పొందదలచుకొని యీవిభజనమును దలపెట్టినదనియు నీవిధానము ప్రభుత్వమునకు క్రొత్తగాక మొదటినుండియు విభజించు పాలించు అను తత్వము మీదనే ప్రభుత్వము సాగించుచున్నది గావున బంగాళావిభజనమునకుకూడ నదే కారణమనియు, నూతనరాష్ట్రనిర్మాణముచే నూతనరాష్ట్రోద్యోగుల నమితవ్యయములు, జీతబత్తెములు, తదితరరాష్ట్రపరిపాలనావిధానమున కగువ్యయ మంతయు నొకేభాగము వహింపవలసి వచ్చునుగాన నందుల కగు నమితవ్యయమునకై పన్నులు హెచ్చించినగాని ప్రభుత్వము సాగదు కావున నట్టి యధికభారమును వెనుకబడియున్న నూతనరాష్ట్రప్రజలు భరింపలేరనియు మొదలగు కారణముల నానాటిపత్రికలు, ఆనాటి యుపన్యాసకులు ఘోషిల్లుచుండుట లోక మెఱింగిన విషయమే

ఇట్టివిభజనము జరిగినంతమాత్రముచే నిక్కడి రాజకీయ వేత్తలాశారహితులు కాలేదు ప్రజాసంస్థను బాగుగా బలపఱచి పారిద్ర్యకమున పెద్దపెట్టున నాందోళనను గావింప ప్రభుత్వము గావించిన యీదారుణవిభజనమును విరమించు కొందురని ప్రజలు తలంచిరి. అందులకై వారు కని విని యెఱుగని యొక మహోద్యమమును లేవదీసి దానిమూలమున ప్రజలకీవిభజనావిధానముగ కలుగు నష్టములగూర్చి చెప్పుటయేగాక విదేశవస్తు బహిష్కరణోద్యమమును బయలుదేరదీసినారు ఆనాటిపత్రికలు, కరపత్రములు, నాయకులు, ఉపన్యాసకులు, వారు వీనిచే ప్రజానీకమునకు ప్రబోధమును గావింప శక్తివంతములైన సర్వవిధముల ప్రజలలో నొకప్రచారమును లేవదీసి "ఒకప్పుడు భాగ్యవంతమైన మనరాష్ట్రము ప్రజాభిప్రాయమునకు భిన్నముగా విభజించుట యన్యాయమనియు, నీవిభజనమువల్ల ప్రజ లధికమైన పన్నుబాధతో దరిద్రులగుదురుగాని భాగ్యవంతులు కాజాలరనియు, ప్రభుత్వదృష్టిని మరల్పుటకు బ్రిటీషువస్తుబహిష్కరణము ప్రధానసూత్రమనియు, నందుచే ప్రజలు స్వదేశవస్తునిర్మాణావశ్యకతను గుర్తించి యందులకై తోడ్పడ వలసినదనియు" ప్రచారము గావించిరి మఱికొందరు "రష్యా జపాన్ వారిని బాధించినట్లే యీనాడు ప్రభుత్వము మనల హింసించి యవమాన

ములను పాలించుచున్న" దనికూడ చెప్ప సాహసించిరి కొందఱు "వంగదేశమున మతము లేదా? దేశాభిమానము లేదా? వారితల్లియైన కాళికాదేవి జ్ఞాపకమునందు లేదా? సర్వశక్తిస్వరూపిణి కాళికాదేవియే ఆమెను స్మరించి మీరు శక్తివంతులుగను మహారాష్ట్రప్రభువై మన దేశనాయకుడైన శ్రీశివాజీమహారాజును స్మరించుచు దేశహితైక కార్యములనొనర్చుచు విదేశవస్తుబహిష్కరణమును గావించి స్వదేశవస్తుప్రాముఖ్యము గడించుడు" అని మరికొందరు ప్రచారము గావించుటకు ప్రారంభించిరి. ఈసమయముననే వంగదేశీయుడైన బంకించంద్రభట్టర్జీ తనకపాలకుండల యను నవలలో 'వందేమాతరం' అనుపాటను రచించి యుండగా వంగదేశీయులీగీతమును గురించి యిది జాతీయగీతముగా జేసి పాడి ప్రచారము గావించసాగిరి. ఈగీత మాకవిచంద్రుడేముహూర్తమున తలపెట్టి వ్రాసినాడో కాని యిది జాతీయగీతమై సేతుశీతాచలపర్యంతమును వ్యాప్తిజెంది దేశభక్తులకు నిత్యపారాయణీయమై యొప్పుచున్నది. అట్టి యీగీతమును ఆనాడు గ్రామగ్రామములవెంట బాడి ప్రజలకుత్సాహమును మొలకలెత్తింప జేయుచు విప్లవకారులు మంచిప్రచారమును గావించిరి. ఈదినములలోనే బాలగంగాధరతిలక్ కలకత్తానగరమునకు వెళ్ళి యుపన్యాసముల నొసంగిరి. అప్పటి కప్పుడే

డనియు నుడువుచుండురు మరికొందఱు రీతని "హాస్తవిశేష ముచే రోగులు బ్రతుకుచున్నారు ఇతడే నీళ్ళిచ్చిన నేమి" యని గొండాడుచుందురు మొత్తముమీాద నతనికి గొప్పవలుకు బడియు, సాహసౌదార్యములు గలవని యెరిగిన వారందరు చెప్పుచుందురు అట్టివాడె శాస్త్రి

## ఇతని బాల్యము

శాస్త్రి తూర్పుగోదావరిజిల్లాలోని మండపేట గ్రామములో శుద్ధవైదీకులలో నచ్చతెలంగాణ్యకుటుంబమునకు జెందినవాడు ఈతడు 1886 సం॥రమున ఫిబ్రవరి 16 వ తేదీని జన్మించెను. వీరితండ్రిగారు రామస్వామిగారు కౌశికగోత్రము గోత్రపురుషుని పట్టుదల, కార్యదీక్ష, సమర్థత వీరిలో కొంతవఱకు ప్రతిఫలించినవి కాని వానికార్యము—దుస్సాహసము, వేగిరపాటు వీరిలో మొదటినుండియుగూడ లేవు వీరితండ్రిగా రేకసంధాగ్రాహి మంచికవులనిగూడ ప్రతీతి శాస్త్రియే చిన్నతనమునుండియు కుటుంబభారమును వహించి చదువులు చెప్పించియు, వివాహముల గావించియు నపరిమిత కష్టముల నందుచుండెనే వాడు ఆకుటుంబభరమునకై విరక్తుడు కాలేదు వీరి వివాహానంతరము విద్య విరమించి కుటుంబవ్యవహారములు చూచుకొనుచుండగ దేశమందు వంగదేశవిభజనపేర రాజకీయాందోళనము ప్రారంభమైనది

## వంగాళా విభజనము

ఏడు కోట్ల యెనభై లక్షల జనాభాతో ముఖ్యపట్టణ మన దగు కలకత్తాతో, బెంగాలు, బిహారు, ఒరిస్సారాష్ట్రములతో కలిపిన భాగము నొక లెఫ్టినెంటు గవర్నరు అధికారముక్రింద నుంచబడినది ఈ విభాగమును మొట్టమొదట గావించిన నాటికిని, లార్డుకర్జను వైసురాయిగా వచ్చునాటికిని, చాలభేదము కలదు జనాభా బాగా అభివృద్ధి యగుట, వర్తక వ్యవహారములు అధికమగుట, రాజకీయ పరిపాలనము క్లిష్టతరముగ నేర్పడుట, విద్యాధికులసంఖ్య యెక్కుడై పెక్కండ్రు రాజకీయములలో పాల్గొనుట మొదలగునవి జరిగినవి

ఇది యిట్లభివృద్ధి యగుచుండగా ప్రభుత్వపటుత్వము క్షీణించినది రాష్ట్రమునకు వలసిన అంగబలగము తక్కువైనది హైందవ ఆంగ్లేయోద్యోగస్థు లెక్కువగ శ్రమింపవలసి వచ్చినది పరిపాలనావిధానమును సాగించు శాఖలు హెచ్చింపవలసి వచ్చినది రహదారీలు అశ్రద్ధ చేయబడినవి ఈలోపము లెక్కుడుగ తూర్పు బంగాళారాష్ట్రమునందు గాన వచ్చినవి ఇందులకు సాయముగ ఆభాగముయొక్క భౌతికలక్షణములుగూడ మిగిలిన భాగము కంటె భిన్నముగ నున్నవి వంగదేశపు మాండలిక పరిపాలనాసంఘమువా రీవిషయమును

గూర్చి యీక్రిందిరీతిని వ్రాసియుంచియున్నారు "మన మెరిగి
యున్నంతవఱకు ఈ మహాదేశములోని తూర్పు బంగాళారాజ్య
ములోని రహదారులు నిర్లక్ష్యముగా చూడబడుచున్నట్లు మరి
యే ప్రాంతములలోను చూడబడ లేదు ఈభూభాగమున గం
భీరమైన నదులు వానిశాఖోపశాఖలతో వివిధముఖముల
విజృంభించి ప్రవహించుటయేగాక, ఇక్కడ నత్యధికవర్షములు
సంతతధారాపాతముగ కురియుచుండుటచే, నీప్రాంతమంతయు
తఱచు జలమయమై యుండుటయు నందుచే భూమి ఫలవం
తమై పంటలధాన్యము, జనపనార మొదలగు ఎంతో మంచిపంటల
నొసంగుచుండుటయు, యిక్కడిప్రజలు కొందఱు కాలక్షేపము
నకై పట్టణములకు జేరుకొన్నను చాలామంది వ్యవసాయాది
వృత్తులలోనే యుండి పోయి యనేకగ్రామములలో నివసించు
టయు జరుగుచున్నది ఇక్కడిపల్లెలు సమూహములుగ లేవు
మెఱక దిబ్బలు కలచోటులలోను, నదులకు వానిశాఖలకు గల
యుభయపక్షములలో నెత్తైన స్థలములలోను జనపదములు,
యిండ్లు నిర్మింపబడియున్నవి తఱచుగా యీగృహములు
వెదురుబడియములలోను, పొదలలోను, ఫలవృక్షముల మ
రుగునను నిర్మింపబడినవి ఇక్కడ కుంభవృష్టిగ కురియు వర్ష
ములచే భూమి జలమయ మగుచుండ మధ్యమధ్య గట్టబడిన
దిబ్బలమీఁది యిండ్లు చిన్నచిన్నద్వీపములవలె గోచరించు

చుండునను పరీమాఖ్యముగు యేకొద్ది రహదారులో నీటిలో మునిగిపోకుండ నుండు నట్లెత్తైన భూభాగముపై వేయబడినవి గాని, మిగిలినవన్నియు నీటిక్రింద మునిగి పోయియే యుండున అందుచే తరచు ప్రయాణములు పడవలమీదనే సాగుచుం డును వర్తకస్థానములు నదుల కుభయపార్శ్వములలోను నిర్మిం పబడి యుండును."

లార్డుఖర్జను వైసురాయిగా నుండిన ఆఖరి రెండునంవ త్సరములలోను యీవిభజనావశ్యకతనుగూర్చి యెక్కుడు చర్చింపబడినది ప్రభుత్వము బంగాళారాష్ట్రమును విభజింప వలెననియు, కలకత్తాలోని రాజకీయనాయకులు విభజనము కూడదనియు చెప్పసాగిరి ప్రభుత్వ మీవిభజనమును చేసి తీరవలెనని నిశ్చయించుకొనినప్పుడు రాజకీయవేత్త లందరైక్య కంఠముతో "నీవిభజనము వలదు జాతీయైక్యత నశించును మాకును మీకును గలసంబంధములు తెగిపోవును కాన విభ జనమువల్ల కాదని" చెప్పసాగిరి ఆజాతీయపత్రికలుకూడ యీవిషయమునుగూర్చిన వ్యాసములు పెక్కులు వ్రాసి ప్రక టింప జొచ్చినవి. మొత్తముమీద ప్రజానీక మీవిభజనము చేయకూడదని పట్టు పట్టగ ప్రభుత్వ మీప్రజానీకమునకు లొంగిపోయి ప్రవర్తింపకూడదు ఈవిభజనమును రాజకీయ ముగ చేసి తీరవలసిన యగత్యము వచ్చినది కావున యీ

భరీంద్రుడు బరోడానుండి కలకత్తాకు వచ్చెను ఆతనిమిత్రు లగు అవినేషభట్టాచార్జి, స్వామివివేకానందుని సోదరుడగు భూపేంద్రనాథుదత్తాగార్ల సహాయముతో బరీంద్రుడు యుగం ధరపత్రికను స్థాపించి ప్రకటించుట ప్రారంభించెను ఈపత్రి కకు యే డెనిమిదివేల చందాదారులు ప్రోగువడిరి ఈబరిం ద్రుడు మన అరవిందఘోషుగారి సోదరుడు వీ రీవిప్లవోద్యమ మునకు 11 రివాల్వర్లను, 4 రైఫిల్సును, 1 టుపాకిని రహస్య ముగ సంపాదించిరి ఈతనిసంఘములో 14 లేక 15 గురు యువకులు ప్రాణార్పణము చేయ సంసిద్ధులై జేరిరి వీ రం దరు కలసి పులిన్ బిహారీదాసు అనువాని నాయకత్వము క్రింద డక్కాలో అనుసీలసమితి యని యొకసమితిని యేర్పాటు చేసుకొనిరి ఈసమితిశాఖలలో నొకటి పశ్చిమబంగాళమునకు ముఖ్యపట్టణమైన కలకత్తాలోను రెండవది తూర్పుబంగాళము నకు ముఖ్యపట్టణమగు డక్కాలోను నెలకొల్పబడినవి ఢక్కా సంఘ మొక్కనాడు 500 ఉపశాఖలైన సమితులతో పనిచేయు చుండెడిది ఈ సంఘసభ్యు లొక్కయుగంధర పత్రికనే నెల కొల్పి పనిచేయలేదు సంధ్యయను నొక పత్రికను బయలు దేరదీసి సంపూర్ణ స్వాతంత్ర్యము కావలెనని మొట్టమొదట నందు ప్రకటించిరి వీరు సాధారణముగ చదువునవి, చదివించు నవి భగవద్గీత, వివేకానందుని యుపన్యాసములు, మాజిని, గారిబాల్డిగార్ల చరిత్రలు మొదలగునవి వీరు ముఖ్యముగా

చదువు నాటినూతన గ్రంథము ముక్తికాఞాపథే ఇది విప్ల వోద్యమమునకు టిప్పణివంటిది ఈ విప్లవోద్యమమును నడి పినవారు వంగదేశస్థులలోని భద్రలోక జాతివారు అనగా ఉత్తమకులీనులని పేరు. వీరు ధనముకొఱకు దోపిడుల సాగించుచుండెడివారట ఆబందిపోటులలో కొన్ని యీదిగువ నుదహరించితిని

(1) ఆగస్టు 1906 లో రంగపురములో నొక విధవ యింటికి ఆగ్రామమందు పోలీసు యిన్స్పెక్టరు వుండినాడని నాడు చోరీ మానివేసిరి.

(2) సెప్టెంబరు 1906 లో శేఖరునగరములో నొక యింటి చోరికి వెళ్ళి యినుపపెట్టె రాకపోవుటచే తెల్లవార్లు బాధ పడి వెళ్ళిపోయిరి (3) 1907 మేలో అరుసులియాలోను, ఆగష్టులో బకూరాలోను దోపిడికి ప్రయత్నములు జరిగినవి గాని వానిని విరమించిరి 1907 లో రైలుని తిరుగదోయు వలెనని యత్నించి డిశంబరు 6 1907 సం॥ తేదీని మిడ్నపూ రులో లెఫ్టినెంటు గవర్నరు పోవు రైలుక్రింద బాంబు పెట్టిరి ఆ ప్రేలుడువలన 5 అడుగుల వెడల్పు 5 అడుగుల లోతుగల గోయితయారయినది రైలు పట్టాలనుండి తొలగినది డక్కా జిల్లాలోని నెరాయిగంజిలో అక్టోబరు 1907 లో సొమ్ము నంచులు పట్టుకొని పోవుచున్న నొక్కని పొడిచి ఆసొమ్ము పట్టుకొని పోయిరి

జగ్గన్న శాస్త్రి

1907 సం॥ డిశంబరు 23 వ తేదీని డక్కా జిల్లా కలెక్టరగు ఆలెన్ దొరను పిస్తోలుతో కాల్చిరి 3 ఏప్రియల్ 1908 తేదీని కలకత్తా ప్రక్కగల సిబిపూరు గ్రామములోనికి యేడు గురు దోపిడిగాండ్రు ఒక యింట్లోనికి ప్రవేశించి రూ॥400-0-0 పిల్లలను చంపుదుమని బెదరించి పట్టుకొనిపోయిరి 1908 ఏప్రియల్ 30 వ తేదీని కెనడీ భార్యయు, కూతురున్ను వెళ్ళు చున్న బండిలోనికి ఒక బాంబును గిరవాటు వేయగా ఆ ఆడవాళ్ళిద్దరు వెంటనే చనిపోయిరి కలకత్తాలోని గార్డెన్ రీచ్ దగ్గరనున్న కింగ్స్‌ఫోర్డును చంపవలెనని యత్నించి యీ ప్రయత్నమును జేసిరి కాని ఆతడు చావలేదు అందుచే నాతనికి ఒక పార్సిలులో ఒక బాంబును పుస్తకములో పెట్టి పంపించియున్నారు పార్సిలు విప్పి పుస్తకమును తెరువగానే బాంబుపగిలి మనిషిని జంపును అట్టిబాంబు పెట్టిన పార్సిలును ఆతడు విప్పలేదు ఆకాలములో జరిగిన కొన్నిహత్యలు మాత్రమే యిం దుదహరించి మిగిలినవి వ్రాయుట గ్రంథ విస్తరభీతిని మానితిని

## వంగరాష్ట్రములో జరిగిన వివిధనేరములు

1906 సం॥రమున ఆగష్టు నెలలో రంగపురం జిల్లాలోని మోహిపురములో బందిపోటు ప్రయత్నము

1906 సం॥రమున సెప్టెంబరు నెలలో ఢక్కా జిల్లాలోని శేఖర్ నగరము లో బందిపోటు ప్రయత్నము

1907 సెప్టెంబరు నెలలో ఢక్కా జిల్లాలోని నేతాయిగంజిలో చోరీనేరము ఒక్కడు పొడువబడినాడు రు 80 అపహరింపబడెను

1907 సం॥రమున సెప్టెంబరు నెలలో ఢక్కా జిల్లాలోని అరునూలియాలో బందిపోటు నేరము

1907 సం॥రమున ఏప్రియలు 21 లోను, జూను 1912 లోను మైమన్‌సింగ్ జిల్లాలో జమాల్‌పూర్‌లో దొమ్మీ నేరము ఒక్కడు పొడువబడినాడు పెక్కండ్రు శిక్షింపబడిరి

1907 సం॥రమున ఆగష్టు నె లో బంకూరాజిల్లాలోని హాసాడంగా బందిపోటు నేరము

1907 సం॥రమున అక్టోబరులో ఛైంచిచంద్ర నగరములో హాసాండగా రైలును తిరుగద్రోయు ప్రయత్నము

1907 సం రమున 6 డిశంబరులో మిధునపురంజిల్లాలోని నారాయణఘర్ లో రైలును తిరుగద్రోయు ప్రయత్నము

1907 సం॥రమున 23 డిశంబరులో ఫరీదుపురముజిల్లాలో గోఆలండోలో ఆలెన్‌దొరను హత్యాయత్నము ఒక్కడు గాయపడెను

1908 సం॥రమున ఏప్రియల్ 3 ని హౌరాజిల్లాలో శ్రీహరిణపరలో బందిపోటు నేరము రు 400 దోపిడి

1908 సం॥రమున ఏప్రియల్ 11 ని ఫ్రెంచిచంద్రనగరంలో బాంబుతో హత్యానేరము

1908 ఏప్రియల్ 30 బిహార్‌లోని ముజఫర్‌పూరులోని హత్యా నేరము 2 స్త్రీలు చంపబడిరి 1 పురుషుడు గాయపడెను

1908 సం॥రమున మే 2, 1910 ఫిబ్రవరి 12, న 24 పరగణా జిల్లాలోని అల్లిపురములో కుట్రనేరము ఈ నేరములో శిక్షలు ఒకనికి ఉరిశిక్ష, ముగ్గురికి 7 సం॥లు, 4 కు యావజ్జీవద్వీపాంతరవాసశిక్ష, 3రికి 10 సం॥రములు, 4 కు 7సం॥రములు, ముగ్గురికి 5 సం॥ములు కఠినవశిక్షలు

1908 సం॥రమున మే 3 ని మిధునపురంజిల్లాలో కుట్రనేరం

1908 సం॥రమున మే 15 ని కలకత్తాలో గ్రేవీధిలో బాంబు పేలుడు

1908 సం॥రమున జూను 2 ని ఢక్కాలో బారాబజారులో హత్యతోకూడిన దోపిడి నేరము 25,837 రూపాయలు దోపిడి జరిగినది 4 గురు చంపబడిరి పెక్కుండ్రు గాయపరుపబడిరి దోపిడిదొంగ ఒకడు చంపబడెను

1908 సం॥రము జూను 21 ని, 24 పరగణాలలో కంకినారలో న్యూకొబ్బరికాయులో నమర్చబడిన బాంబుతోనేరములు

1908 సం॥రమున ఆగష్టు 15ని, మైమన్‌శింగుజిల్లాలోని బజిత్‌పురంలో దోపిడినేరం రు 1500 నష్టం

1908 సం॥రమున ఆగష్టు 21 ని 24 పరగణాలలో శ్యామనగ నగరములో కొబ్బరికాయలో సమర్చబడిన బాంబుతో చేసిన నేరములు

1908 సం॥రమున నవంబరు 1వని, 24 పరగణాలలో బెల్గారియా కొబ్బరికాయలో సమర్చబడిన బాంబుతో చేసిన నేరములు

1908 సం॥రమున డిశంబరు 21 ని, పరగణాలలో సోదెపురంలో కొబ్బరికాయలో సమర్చబడిన బాంబుతో చేసిన నేరము.

1908 సం॥రమున ఆగష్టు 14 ని, ఢాకాలోని సతిర్పణలో పడవదొంగతనము 3గురికి 4 మాసములు కఠినము రు50 జరిమానా

1908 సెప్టెంబరు 1 ని, 24 పరగణాలలో అలిపురం జెయిలులో నరేన్ గోసాయిన్ అనువాని హత్య ఇద్దరు నేరస్థులు వురి ఒక్కడు 1½ సం॥రములకు, వేరొక్కడు 1 సం॥రం శిక్ష.

1908 సెప్టెంబరు 16 ని, హూగ్లీలో బిగహాత్రి గ్రామంలో దోపిడి రు 585 లు నష్టం ఒక కి 6 సం॥రము 2 రికి 5 సం॥రము వేరొక్కనికి 3½ సం॥రముల శిక్ష.

1908 అక్టోబరు 30 ని, ఫరీద్‌పూర్ జిల్లాలోని నారియాలో తుపాకులతో దోపిడి పోయినసొమ్ము రు 670 లు, నష్టం రు 6, 400 లు ఇరువురు గాయపడిరి

1908 నవంబరు 7 ని కలకత్తా ఒవర్టన్ హాలులో సర్ ఆండ్రూ ఫ్రేజరుని హత్యానేరము నేరస్థునికి 10 సంవత్సరములు శిక్ష

1908 నవంబరు 9 ని కలకత్తాలో సర్పెంటైన్ లేనులో నందాలాల్ బెనర్జి అనుయిన్స్పెక్టరుని హత్య
1908 నవంబరు 14 ని డక్కాలో రాంమ్నాలో సుకుమార చక్రివర్తిని హత్య
1908 నవంబరులో హౌరాలో కేశబీడిఅనువాని హత్య
1908 నవంబరులో డక్కాలో రామ్నాలో అన్నాదఘోషు అనువాని హత్య
1908 నవంబరులో నాడియాజిల్లాలో రైతాగ్రామంలో దోపిడి నేరంలో రు 1915 లు చోరీ
1908 డిశంబరు 2 ని, హూగ్లీలో మోరేహాల్ గ్రామంలో దోపిడి నేరంలో రు 1500 లు చోరీ ఒకనికిగాయములు తగిలినవి ఒకనేరస్తునికి 7 సం॥రము లు శిక్ష
1908 డిశంబరు 21 ని, బకర్గంజిజిల్లాలో డెహార్ గాటిలో దోపిడినేరంలో రు 6, 000 లు చోరీ సెడిషన్ కమిటీ 191 రు రిపోర్టులో

(రౌలట్ రిపోర్టులో 86, 87, 88, 89 పేజీలలో నిచ్చినపట్టికలు*

* దౌర్జన్యయుతమైన విప్లవోద్యోగమువలన దేశజాలకు కలుగు నష్టములను నిరూపించుటకె యిది వ్రాయబడినది

బంగాళములో నీవిప్లవోద్యమ మింత తీవ్రముగా జరుగుచున్నకాలములో ఆదేశమునుండి బాబూ బిపిన్ చంద్రపాలు ఆంధ్రదేశమునకు వచ్చి బంగాళావిభజనమునుగూర్చి తీవ్రమగు ప్రచారమును గావించెను ఆదినములలో పాల్ తిరగని గ్రామము తిరగని పల్లె లేదు అన్నిగ్రామములందునను విదేశవస్తుబహిష్కరణమును స్వదేశీవస్తుప్రోత్సాహమును నాతడు చేయుచు వచ్చెను కాని యీపాలుగారికి ఆంధ్రదేశము క్రొత్త మరియు యీ ఆంధ్రదేశమున కిట్టి విప్లవోద్యమము క్రొత్త పాల్‌గారిసభలకుకూడ వెళ్ళి వినుటయె దుర్ఘటముగనుండెడిది ఆనాటికి యెఱ్ఱపాగాను జూచి జడియని యుద్యోగి లేడు ఎంతటి గృహస్థయినను పోలీసు అన్న మాడలెత్తి లోనికిపోయి తలుపులు వేసుకొనవలసినదే అట్టిభయకంపితసమయములందు పాలుగారితో ఆంధ్రదేశసంచారమునకు బయలుదేరి ప్రబోధము గావించినవాడు ఒక్క జగన్నశాస్త్రియే ఆనాటినుండియు నితని కాయుద్యమములో నుత్సాహము కలిగి తీవ్రప్రబోధమునకు గడంగుచుండెడివాడు

ఈబిపిన్‌చంద్రపాలుగారు 24–4–1907 తేదీని రాజమండ్రీ వచ్చినప్పుడు శ్రీశాస్త్రిగారును, గాడిచెర్ల హరిసర్వోత్తమరావుగారును వారితో కలిసి పనిచేసిరి ఆ రాజమండ్రి కళాశాలవిద్యార్థులను మార్కుహాంటరుదొర వెలుపలకు రానీయ

కుండ నావుజేసినప్పుడు శాస్త్రి ట్రెయినింగు కాలేజీ విద్యార్థులచే సమ్మె కట్టించి యొక్క విద్యార్థినైన కళాశాలలోనికి పోకుండ నావుచేసెను అదే ప్రప్రథమమున రాజకీయరంగములోనిం దిగినది అప్పటినుండియు శాస్త్రి బహిరంగముగ రాజకీయములలో జోక్యము కలుగజేసికొని పనిచేయుచుండెడివాడు వీనితో గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారేకాక బోడి నారాయణరావనువారుకూడ కలిసి పనిచేయ నారంభించిరి శాస్త్రి పాలుగారితో నాంధ్రదేశసంచారమునకు బయలుదేరి వివిధ గ్రామములు పల్లెలు పత్తనములు చూచి ప్రతిస్థలములో నువన్యాసములనొసంగి ప్రజలకు స్వదేశాభిమానమునుగలిగించుచు వచ్చెను "According to a report of the meeting in the Bande Mataram news paper of May 27 th 1907 Bepin Chendra Pal had been followed by a Madrasi Gentleman who declared that they ought to go abroad and learn the manufacturing of bombs and other destructive weapons and how to wield them, and return them to their country to sacrifice every Amavasya night 108 whites (not white Cambs but those who who were their enemies) and these the bright prospect of the whole nation lay in future"

*Pages 162-163 Sedition Committee 1918 Report*

కడెమవా రిరువురు బెజవాడలో "స్వరాజ్య" యను నాంధ్రవారపత్రికను స్థాపించి ప్రచురించి ప్రబోధముగావించు చుండెడివారు ది 26 మార్చి 1908 సం॥రమున చిదంబరం పిళ్ళెను రాజకీయాందోళనకై చెఱలో బెట్టునపుడు స్వరాజ్య పత్రికలో నీదిగువరీతి నొక వ్యాసము ప్రకటింపఁబడెను

"అరే, ఫరంగీ, కూ్రరవ్యాఘ్రమా, నిష్కారణముగ నీవు ముగ్గురు హిందువులను ఒక్కసారిగ పొట్టను పెట్టుకొం టివా? నీవు నీనీతిచట్టములన్నగూడ నతిక్రమించుచున్నావు ఓభయభ్రాంతుడా, పొగరుమోతుతనమున కన్నులుం గానని వారికి సహజలక్షణమైన యిట్టి వ్యతిరేకాభిప్రాయములను కలిగి నీవు నీరహస్యములను బయటపెట్టుకొంటివి హిందూజాతీయాభి వృద్ధితో మీావిదేశపరిపాలనావిధాన మంత మొందగలదని నీవే ఋజువు చేసి చెప్పుచున్నావు"

అని వ్రాసి ప్రకటించుటచే ఆపత్రికాముద్రాపకుని, ఆ పత్రికాధిపతిని పట్టుకొని విచారించి శిక్షించిరి ఈశిక్షతో, ఆ పత్రిక అంత మొందినది ఆనాటి శాస్త్రి యుపన్యాసము లు వినినవారిలో గొందఱు నేడు జాతీయనాయకులై దేశప్రఖ్యాతి గాంచినవారు గలరు శాస్త్రి తన మొట్టమొదటి యుపన్యా సము 1907 లో చామర్లకోటలో నిచ్చెను అక్కడనుండి బయలుదేరి వివిధగ్రామములలో నుపన్యసించి ప్రబోధము గావించుచు వేలకొలదిప్రజలకు రాజకీయములం దుత్సాహ

మును గలుగజేసెను ఆనాఁ డతడు చేసినప్రచారము వంగదేశ
ములోని గద్దరువిప్లవకారుని ప్రచారమున కేమాత్రము దీసి
పోదనియు, అక్కడ పందముందిగ గావించినంత ప్రచారము
శాస్త్రి యొక్కడే గావించెననియు వ్రాయుట యతిశయోక్తి
కాదు ఇతడు బందరు మొదలగుగ్రామములలో విప్లవసంఘ
ముల నెలకొల్పెనుగాని యాసంఘములు లేవియు సంతృప్తికర
ముగా బని చేయలేదు అంతమాత్రముచే శాస్త్రి నిరుత్సాహి
గా లేదు అట్టియసంతృప్తి గలిగినచోటులం దెల్ల శాస్త్రి ద్విగు
ణీకృతోత్సాహముతో బనిచేయుచు వచ్చెను

## వంగల వేంకటనారాయణగారు

ఇచ్చట వీరినిగూర్చి కొంచెము వ్రాయవలసియున్నది
వంగల వేంకటనారాయణగారు వైదీకులలోని తెలగాణ్య
శాఖను జెందినవారు అత్రిలి వాస్తవ్యులు రసాయనశాస్త్రము
వీరి కభిమానవిద్య ఈశాస్త్రములో వీరు బి యే పరీక్షయం
దుత్తీర్ణులయి మంచిపాండిత్యమును సంపాదించి యుండిరి వీరి
కున్నంత యభినివేశము ఉత్సాహము మరెవ్వరికిని లేదు వీ
రిరువురు సోదరులు ఇరువురు నట్టివారే వీ రిరువురిలో వేంకట
నారాయణగారు పెద్దవాడు రెండవవాడు శివరాంగారు
లక్నోయూనివర్శిటీలో గొప్పపదవియందున్నారు కృష్ణాపత్రి

కాధిపతులగు మ. ట్న్నారి కృష్ణారావుగారి కుమార్తెను వివా
హాహ్ చేసికొనియుండిరి వీరు యూరప్పు అమెరికా దేశముల
కేగి మంచివిజ్ఞానమును సముపార్జించుకొని యున్నారు

వెంకట నారాయణగారు బి యే పరీక్షయం దుత్తీర్ణు
లయి ఒకటి రెండు సంవత్సరము లుపాధ్యాయవృత్తిలో బ్రవే
శించి పనిచేసి పిమ్మట జపాను వెళ్ళిరి అక్కడ పరిజ్ఞానమును
సంపూర్ణముగ సలవఱచుకొని బహుళముగ వ్యాపారము సేయు
టకు వలయు రసాయన పరిశోధనావశ్యక వస్తునిర్మాణమును
నేర్చుకొనిరి. మరియు వీ రచ్చట స్వేచ్ఛ ననుభవించుచున్న
యా దేశముల సౌభాగ్యమును గన్నులార గనుగొని, వారి
స్వతంత్రతా వాయువుల పీల్చి వారిస్వరాజ్యపరిపాలనా సౌకర్య
ముల గుర్తించుకొని స్వదేశమునకు 1905—1906 సంవత్స
రములలో తిరిగి వచ్చివేసి రాజమండ్రిలో నివాస మేర్పాటు
గావించుకొనిరి అప్పటినుండియు శాస్త్రికిని వీరికిని అత్యంత
మైత్రి కలిగినది శాస్త్రి రాజకీయములలో ప్రవేశించినది
మొదలు వేంకటనారాయణగారు వీరిని యత్యాప్తులుగ దీసి
కొని వలయు రహస్యముల బోధింపుచు సర్వవిధముల చేదోడు
వాదోడుగా నుండి శాస్త్రికి మంచిసహాయ్యమును జేసెను

ఆనాడు రాజమహేంద్రవరములో వేంకటనారాయణ
గారియిల్లు యీతీవ్రరాజకీయాందోళనావరుల కాశ్రయమైనది

ఎప్వ రేవిషయము మాట్లాడుకొనవలసివచ్చినను వేంకటనారా యణగారియింటికి వచ్చెడివారు ఎవ్వ రేవారంటు తప్పించు కొనవలెనని తలచినను వేంకటనారాయణగారియింటికి వచ్చెడి వారు వేంకటనారాయణగారును వారిసతియు వచ్చినవారి నాద రించి వేయి సౌకర్యములనొసగుచుండెడివారు ఆకాలము లో వెంకటనారాయణగారు మంచినలహాదారుగా నుండి పని చేసిరేకాని వారు సాహసించి ముందున కడుగిడలేదు

కాని వీరి సతి యట్లు గాదు ఆనాడు మంచివిప్లవకారు లతో సమముగా పనిచేయ గలిగినది ఎట్టిపాగా జూచి జడియు నాకాలములో ఆమె స్త్రీయయ్యు ధైర్యోత్సాహములతో ముం దంజవేసి విప్లవమునకు సాయ మొనర్చినది ఎవరి కేవార్త చేరవలసివచ్చినను ఆమెమూలముం చేరుచుండెడిది ఎవ్వరికే అత్యంతరహస్యమైన జాబు చేరవలసివచ్చినను ఆమె తీసుకొని వెడలుచుండెడిది దుస్తులమార్చియు, వివిధవేషముల వేసియు పోలీసులకు చిక్కకుండ విప్లవకారులకు మంచినహాయ్యమును జేసినది ఆనాడు ఆయువతి యొక్క కీర్తియే

ఒక్కనాడీమె దొరసానివేషముతో గోదావరిస్టేష నులో దిగినది పోలీసువారు చూచిరి వెన్నంటిరి రెండు మూడు సందులు దాటినది మాయ మయినది పోలీసువారి కామె చహారా దొరకలేదు. అప్పు డీమె తిన్నగా మాయిం

టికే వచ్చినది ఈదొరసాని వేషము లోనున్న యీ మాసోద
రిని మాతల్లి చూచి యాశ్చర్యపడినది "అమ్మా! ఇది యేమిటి"
అని ప్రశ్నించినది ఆమె స్త్రీలితో మాటాడవలదని సౌంజ్ఞ
చేసినది లోనికి వెడలి ఆవిదేశ వేషముతు తీసివేసి మోమున
కింత పసుపు రాచుకొని స్నానముచేసి పట్టుచీర కట్టుకొని పళ్ళె
ము లో రెండుపళ్ళు కొన్నిపువ్వులు పెట్టుకొని చేతితో చెంబు
నీళ్ళు పట్టుకొని రహస్యమైన జాబులు మొలలో దాచుకొని
తిన్నగ కాలినడకను దేవాలయమున కేగి అక్కడనుండి బండి
కట్టించుకొని తిన్నగ తనయింటికి పోయినది భర్త యీమెను
జూచి ఎప్పుడు వచ్చితివి ఈవేష మేమి యని బ్రశ్నింప పోలీ
సులు వెన్నంటుట తాను తనపుట్టినయిన మాయింటికి వచ్చు
టాది సర్వవిషయముల చెప్పి తాను తెచ్చిన రహస్యమైన
జాబును నాతని కిచ్చినది

ఇట్టి ధైర్యస్థయిర్యములతో ఆనాటి కాలము లో పని
చేసిన ఆయువతి యీ ఓచయి తతో నేకగర్భజనిత — ఆమె
1914 సం॥న బొంబాయిలో మరణించినది

1903 సం॥రమున గోదావరి పుష్కరసమయమున శ్రీ
శాస్త్రీయు, వంగల వెంకటనారాయణగారును గలిసి "యాత్రి
కులసౌకర్యార్థము అన్నివిషయములు తెలిసికొనవచ్చును" అని
యొకబోర్డును గట్టి యక్కడ కచ్చేరివి బెట్టుకొని యాత్రికులకు
వలయు సౌకర్యము లన్నియు జూచుచుండిరి

నాటికలెక్టరుదొరగారి "ది కష్టముగా దోచి యాంబో ర్డును తీయించివేయు మనెను అందులకు వంగల వెంకటనారా యణగారును, శ్రీశాస్త్రియు అడ్డగించి యెదురుసమాధాన ములు చెప్పుచు పోలీసు సూపరింటెండెంటుతో దెబ్బలాడగా కలెక్టరున కావిషయము తెలిసి శాస్త్రిని వచ్చి కలిసికొన వల సినదని యప్పటి తహసీల్దారైన దావులూరి ఉమామహేశ్వర రావుచే కబురంపెను అంతపై ఉమామహేశ్వరరావు మండ పేటవచ్చి శాస్త్రిని కలిసికొని యాతనిని వెంటబెట్టుకొని కాకి నాడ కలెక్టరుగారిదగ్గఱకు దీసికొనివెళ్లెను కలెక్టరుగారు శా స్త్రిని "అరెస్టు" చేయుటకు ప్రభుత్వమువా రనుజ్ఞ నిచ్చిరని యు, కాని జిల్లాలోని శాంతికి భంగము కలుగకుండుటకై "అరెస్టు" చేయదలచుకొన లేదనియు దెల్పుచు నిట్టిరాజకీయ విప్లవోద్యోగములలో సంబంధము పెట్టుకొనవలదని చెప్పెను

రెండుమూడు నెలలలో కాకినాడలోని జిల్లాకలెక్టరు Ashi దొర తిరునల్వేలిజిల్లాకు మార్పబడెను కాని యప్పటి కప్పుడే తిరునల్వేలిలో విప్లవాగ్నిజ్వాలలు జిల్లాయంతటను విజృంభించినవి కలెక్టరుదొరను రైల్వేస్టేషనులో రైలుబండి లో నుండగా విప్లవకారులు వచ్చి 'రివాల్వరు'తో గాల్చి చంపి వేసిరి

కాని శాస్త్రి నింతటితో బ్రిటిషుప్రభుత్వమువారు వదలిపెట్ట లేదు ఈతనిపై నొక "వారంటు" బుట్టించి పట్టుకొన బ్రియ

త్నము చేయుగా రాజమహేంద్రవరములోని మిత్రుల కానం
గతి తెలిసినది రహస్యముగా శాస్త్రిని రావించి రాత్రి పం
డ్రెండుగంటలకు గున్నేశ్వరరావుప్రభృతులు వలసిన డబ్బు
నిచ్చి శాస్త్రిని బొంబాయి పారిపోవలసినదని చెప్పి యిరువు
రను గోదావరిని దాటుటకు సాహాయ్యమిచ్చి పంపివేసిరి ఆ
రాత్రికి రాత్రిగోదావరిని దాటి నిడదవోలు కాలినడకను వెళ్ళి
యక్కడనుండి రైలుమీద బెజవాడకుపోయి యక్కడి స్వరా
జ్యపత్రికాలయమునకు వెళ్లునరికి అక్కడపత్రిభుత్వోద్యోగి
పత్రికాధిపతిపై వారంటు సిద్ధము చేసికొని "అరెస్టు" చేయు
టకు చూచుచుండెను ఆస్థితిలో నున్నపత్రికాధిపతిని కలిసి
కొని ప్రసంగించి శాస్త్రి తనస్థితిగతులను జెప్పుకొని నాటి
రేయి బయలుదేరి బొంబాయి జేరి J N Podhar
జె యన్ పోద్దార్ అనువారియింటికి వెళ్ళెను ఈ Podhar
అనువాడు జపానులో వంగల వెంకటనారాయణగారికి సహా
ధ్యాయి అందుచే వెంకటనారాయణగారు పోద్దారునకు జాబు
నిచ్చి శాస్త్రిని బంపించెను అచ్చట మహీంలో శాస్త్రి పోద్దా
రును కలిసికొనెను బొంబాయిలోగూడ సరిగ నిట్టులే పరి
స్థితులు పోద్దారు బాంబులుచేసి నూతిలో బడవేసినట్లు పోలీసు
వారికి పంపిన దొంగరిపోర్టుమూలమున దెలియవచ్చినదనియు,
పోలీసు కొలదిగంటలలో వానియింటికి తనిఖీకి వచ్చెదరనియు

తెలిసికొని పోద్దారు కనిపెట్టుకొనియుండగా శాస్త్రి వానియింటికి బోయి వానిని గలిసికొనెను. రెండునిమేషములలో నొకరి సంగతి నొకరు తెలిసికొనిరి. శాస్త్రిని కాల్పత్రికా కార్యాలయాధికారియైన పరంజపాయిగారి దగ్గఱకు తీసికొనిపోయెను. పరంజపాయిపై బొంబాయి హైకోర్టులో రాజద్రోహనేరము క్రింద కేసు తేబడినది. పరంజపాయి న్యాయముగా దనపక్షమున దానే వాదించుకొనుచున్న సమయమది. ఆరోజులలో శాస్త్రి పరంజపాయియింటికి వెడలెను. పరంజపాయి తనచరిత్ర యావత్తు శాస్త్రికి జెప్పెను. శాస్త్రి తనసంగతి పరంజపాయికి దెలియజేసెను. ఇరువురును మిత్రులైరి. శాస్త్రికి వలయు సౌకర్యము లన్నియు రెండునిమిషములలో నాతడు సమకూర్ప గలిగెను. బస, భోజనసదుపాయము, వలసిన గ్రంథములు, ధనము నిచ్చి శాస్త్రిని బహుమర్యాదతో నాదరించెను. అట్లు శాస్త్రి యజ్ఞాతవాసమందు రెండు నెలలు గడపెను. శాస్త్రిని వెదకివెదకి పోలీసువారు వారంటు రద్దు చేసికొనిరి. కాబోలు శాస్త్రి మఱి మూడుమాసములకు రాజమండ్రికి వచ్చెను. కాని పోలీసువారు వీనిని వెంబడించుచు రహస్యపరిశోధనము చేయుచు వచ్చిరేగాని యేవిధమగు కేసును బెట్టలేదు. అందు చేతనే శాస్త్రి యాంధ్రులలోని కెల్ల ప్రథమవిప్లవకారుడని చెప్పవలసియున్నది. విప్లవకారు డనిపించుకొనుటకు శాస్త్రి

యెంతయు గర్వపడుచుండును ఆకాలము లో శాస్త్రి మారు వేషములోనే సంచారము గావించెడువాడు వీనికి తురక వేష ము బాగుగ సంపోయెడిదియని నేటిమిత్రులు చెప్పుచుందురు

ఈ రీతిగా 1910 సం॥రము ఆఖరువరకు నాంధ్ర దేశ మంతయు ప్రచారము గావించి 1911 సం॥రములో వైద్యవిద్య నభ్యసించుటకై కలకత్తా వెడలెను అక్కడ నాలుగు సంవ త్సరములుండి వైద్యమును నేర్చికొనుచు నక్కడి ప్రముఖులైన శ్యామసుందరచక్రవర్తిగారి చెలిమిని సంపాదించిరి ఈ రచ్చట 1914 సం॥ రము వఱకునుండి వైద్యవిద్యను సంపూర్ణముగ నభ్యసించి వచ్చిరి వీరితో నాడు కలకత్తాలో జదివిన యాంధ్రులు డాక్టరు బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యముగారు, వేదాం తం వెంకటకృష్ణయ్యగారు ప్రభృతులు వీరందఱితోడను శ్రీ శాస్త్రిగారు విద్య నభ్యసించిరి కాని పర్యవసానము? కలకత్తా నుండి యింటికి వచ్చిన మఱుచటిదినమున నరెస్టుచేయబడి వీరు చెన్నపట్టణము తీసికొని పోబడిరి కారణము?

## రోడ్డా కంపెనీ

శాస్త్రి కలకత్తాలో జదువుచున్న 1914 సం॥రమున కలకత్తాలో నొకకంపెనీ యుండెడిది ఆకంపెనీపేరు రోడ్డా అండ్ కంపెనీ ఈవర్తకులు తుపాకులను, పిస్తోళ్ళను, మందు

గుండుసామానులను విక్రయించుచుండువారు విప్లవోద్యమము నకు నంబంధించిన యొక పెద్దచోరీనేర మీకాలములో జరిగి నది 4 ఆగష్టు 1914 సం॥రం తేదీ అందరికి జ్ఞాపక మున్న తారీఖే ఏలయన నాడే మొదటి ప్రపంచసంగ్రామమునకు బ్రిటిషుప్రభుత్వము యుద్ధప్రకటనము చేసినది ఈప్రకటన మైన పదిపదిదినముల కనగా 14 ఆగష్టు 1914 సం॥రం తేదీని రోడ్డాకంపెనీవారికై విదేశమునుండి 202 పాకేజీలలో పిస్తో ళ్ళును, మందుగుండుసామానును, దిగుమతి కాబడినవి రోడ్డా కంపెనీ యుద్యోగస్థులలో మిక్కిలి మంచివాడు నమ్మకమైన వాడు నగు గుమాస్తాకు వలసిన కాగితముల నిచ్చి కష్టమ్సు కచ్చేరికి పంపించి వానిని తమకు వచ్చిన 202 కేసులను నరకు నిలువకొట్లలోనికి బంపవలసినదిగా జెప్పిరి అత డతిశ్రద్ధాభక్తు లతో సముద్రపుటొడ్డున నున్నకష్టమ్సు కచ్చేరికి వెళ్ళియక్కడ నుండి తనన్వంతకంపెనీకి (అనగా రోడ్డా అండ్ కంపెనీకి) 192 కేసులు దిగుమతిచేసి యానాటి కింతకంటె బంపుటకు వీలు లేక పోయినదనిమాత్రము కచ్చేరీలోని ముఖ్యోద్యోగులకు దెల్పి యింటికి వెడలిపోయినాడు కాని యాతడానాటినుండి యీ నాటివఱకు కంపెనీలోనికి వెడలలేదట. అతడు కంపెనీకి వెళ్ళక పోవుటతో కుదిరిన బాగుండి యుండును కాని యట్లు జరుగ లేదు కష్టమ్సుఆఫీసులో దిగబెట్టి వచ్చితినని చెప్పిన మిగిలిన

పది కేసులునుగూడ గంపెనీకి యెప్పటికిని చేరలేదు కంపెనీ వారు మూడురోజులు ముందుకెనుక లాలోచించి తుదకు మూడవనాడు పోలీసువారి కీవార్త తెలుపుడు చేసియున్నారు. ఈపదికేసులలోను పోయిన సరకుల వివరము మాసూరు పిస్తోళ్ళు 50 మాత్రము వానికి నుపయోగపడు మందుగుండు 46000 నలుపదియాఱువేల రౌండ్లుమాత్రము ఈసరకులలో 44 పిస్తోళ్ళు మొదటినాటిరాత్రియే తొమ్మిది విప్లవసంఘము లకు జేరిపోయినవనియు మిగిలిన 6 పిస్తోళ్ళు నెక్కడ దాచిరో తెలియకున్నదనియు ప్రభుత్వము తలంచినది మొత్తము మీద 1914 దాటినపిదప నీపిస్తోళ్ళు 54 బందిపోటు హత్యానేరము లలో నుపయోగపడినట్లు పోలీసు లెక్కలలోనికిమాత్రము వచ్చినది పోలీసువారి చాకచక్యముచేతను, వారిసునిశితబుద్ధి చేతను, వారికార్యోత్సాహముచేతను 31 పిస్తోళ్ళను దిరిగి యప్పుడప్పుడు రాబట్టుకొనగలిగిరి ప్రభుత్వమువారీసందర్భ మున గలకత్తాలో 150 యిండ్లనోకేసారి సోదా చేసిరి అం దులో శాస్త్రిబన యొకటి ఈసందర్భమున రాష్ బిహారిబో సును కలిసికొని వారిమైత్రి నీతడు సంపాదించెను

## రాష్‌బిహారిబోసు

ఈరాష్‌బిహారిబోసు డేరాడూన్‌లో Forest research Institute లో హెడ్డుగుమాస్తాగా బనిచేయు

చుండెడివాఁడు ఇతఁడు బంగాళాయువకుఁడు విప్లవసంఘనాయకుఁడు ఈతఁడనేకవిధముల ప్రభుత్వమును గూల్ద్రోయుమార్గముల నరయుచుండెను వ్యాసముల వ్రాసి ప్రకటించియు, వివిధ సంఘముల స్థాపించి ప్రబోధించియు, ప్రభుత్వమునకు గంటకముగ నుండెడివాఁడు 1912 స॥రం డిసెంబరునెలలో ఢిల్లీలో నూరేగుచున్న వైస్రాయి హార్డింజమీఁద బాంబువేసినవాఁడన యిటీవల తెలియవచ్చినది అప్పటినుండియు బోలీసువా రీతనిని బట్టుకొన విశ్వప్రయత్నములు గావించిరి ఈతని Photo ఫోటోను బహిరంగముగ బ్రకటించి యీతనిని బట్టి యిచ్చిన వారికి విశేషబహుమానము నిత్తుమని ప్రకటించిరి కాని యీతనిని బట్టుకొనుట కెవ్వరికిని సాధ్యము కాలేదు ఢిల్లీకుట్రకేసులోను 1914 లాహోరుకుట్రకేసులోను నీతనిని ముద్దాయిగా బ్రకటించిరి కాని ప్రభుత్వ మీతనివిషయములో విఫలమనోరథులైరి ఈతనిని బహుక్రూరునిగ, భయంకరునిగ బ్రభుత్వము తలంచి యెట్టిబహుమానమ నిచ్చెదమని ప్రకటించిన నతని నెవ్వరు బట్టి యీయలేదు ఈతఁడు కాశీలో నివాస మేర్పఱచుకొనెను అక్కడ నొకవిప్లవసంఘమును స్థాపించి పని చేయ నారంభించెను 1914 సం॥రమునుగూడ నీతఁడు కాశీలోనే నివాస మేర్పఱచుకొనెను బంగాళీతోళాలో బసచేసి యుండుటచేతను, నది వంగదేశీయుల ప్రధానస్థానమై యుండు

టచేత న్న, బోలీసువారి కీతనియాచోకి దొరకలేదు ఈతడు రాత్రులందు బయటికి వచ్చి తనకృత్యముల నెఱవేర్చుకొను చుండెడివా డట ఇతడు సచ్చీంద్రునిసంఘముతో సంబంధము పెట్టుకొని పనిచేయుచుండెడివాడు పిస్తోళ్ళు పేల్చువిధానమును, బాంబు నుపయోగించుపద్ధతిని నీతడు నేర్పు చుండగా 18 నవంబరు 1914 సంవత్సరము నాటి రాత్రి పూట 2 బాంబు మూతలు చేతిలో ప్రేలి యీతనిని సచ్చీంద్రుని గూడ గాయపఱచినవి అప్పుడీతడు తననివాసమును మఱియొక చోటునకు మార్చినాడు అతి డచ్చటనున్న కాలములోనే గణేశపింగళే యను పూనాగ్రామనివాసి వచ్చి కలిసికొనెను అతడు చెప్పినమాటలనుబట్టి సచ్చీంద్రునిచే పంజాబులోని విప్లవసంఘమువారి కవసరము వచ్చిన దామ సాహాయ్యమొనర్తుమని చెప్పి వార్త నంపెను ఆసచ్చీంద్రుడు 1915 సం॥ రములో పింగళేతో కలిసి కాశీ వచ్చి రాష్‌విహారిబోసును కలిసికొనెను పిదప నాతడు డిలహాబాదున కొకనాయకుని యేర్పాటు గావించి పింగళేను సచ్చీంద్రుని వెంటబెట్టుకొని పంజాబున కరిగెను ఆనెల 21 తేదిని విప్లవమును సర్వతోముఖముగ విజృంభింప జేయుట కాతడు పూనుకొనెను కాని యీవిషయములో పంజాబులోని పోలీసువారి కీసంఘసభ్యు డొకడు రహస్యమును బయటపెట్టినట్లు తెలిసి విప్లవమును

బయలుదేర దీయలేదు పోలీసువారి కెరహస్యము తెలిసినది పెక్కండ్రిను బట్టుకొనిరి రాష్‌బిహారిబోసు లాహోరునుండి కాశీకి వచ్చివేసి యక్కడినుం కలకత్తా వెడలి అక్కడ తోడి కాశీమిత్రులను గలిసికొని హిందూయవర్గ్మలకు వెడలి పోవుచున్నానని తెల్పి వెడలిపోయె. కాశీలోని విప్లవసంఘము రాష్‌బిహారిబోసు యుయాజమాన్యమునకు వచ్చిన పిమ్మటనే యొక గొప్పవిప్లవకేంద్రముగ మార్పబడినది 1915 సం॥ రములో హిందూదేశమును విడిచి టిబెత్తును దాటి చైనాదేశమును బ్రవేశించెను అక్కడ చైనానాయకుడైన సన్ యత్ సేనునకు శిష్యుడై కొంతకాల ముండెను ఆకాలమందే నేటి చైనానాయకుడైన చాంగ్ కై షేకుగూడ శిష్యుడై యీబోసునకు సహాధ్యాయియై యుండెను అక్కడ గొన్నినెలలుండి జపానునకు వెడలి యచ్చట హిందూదేశవిప్లవసంఘమును లేవదీసెను ఇంతలకు జపానుప్రభుత్వము సాహాయ్యమును జేసెను ఈతి డీసంవత్సరములోనే చనిపోయినట్లు పత్రికాముఖముల దెలియవచ్చినది

## శాస్త్రి నిర్బంధము

మిగిలినపిస్తోళ్ళకై నేటివఱకు వెదుకకపోవుట లేదు కాని పిస్తోళ్ళు దొరక లేగు ఆయాశ కృశించినది నిరాశ పెరిగినది

ఏయితరరాష్ట్రముల కవి యెగిరిపోయెనో యెవ్వరి కెఱుక? బెంగాలలోనే యున్నవో? ఏవంకున కేగినవో? యెవ్వరి కెఱుక? అటువలే యుండి పుచ్చుకొనిరో ఆంధ్రులకే హస్తగతము లైనవో యెవ్వ రెఱుంగుదురు? అందులకే శాస్త్రిని ఆనాడే కలకత్తానుండి వచ్చినవానిని అన్నమైన తిననీయకుండ నరెస్టుచేసి మొదట చెన్నపట్టణమునకును, పిదప పోలీసుదౌర్జన్యములకు బొంబాయి ప్రసిద్ధియున్నట్లు తిన్నగ బొంబాయికిని దీసికొనిపోయిరి అదివఱ కక్కడకే యైదుగురు వచ్చియుండిరి ఆఱవవాడు శాస్త్రి అక్కడిపోలీసువా రతిథిపూజాధురంధరులు వీరికి సుత్తెల స్వాగతము బూతుల నష్టోత్తరపారాయణము, లాఠీల పూజ, చపేటముల వడ్డన, అర్ధచంద్రప్రహారముల విందు, తన్నుల తాంబూలము, పిడికిట దక్షిణలు పోలీసు సంతుష్టిగ సావకాశముగ స్థిమితముగ తీరుబడిగ అతిథి పూజలలో నగ్రగణ్యులుగాక వలదన్నను మోమోటపడిన వారికివోలె వడ్డించెడివారు కాని—కాని—వీరో—

కొట్టిన దెబ్బలతో, పొడిచిన పోటులతో, కట్టిన బొబ్బలతో, కమిలిన గాయములతో, కారెడి రక్తముతో, వాచెడి యుసురులతో—చెదరని గుండెను, కదలని నాలుక, పరుండలేని, కూర్చొనలేని, నిలువలేని, నడువగలేని, సడలిన యొడళ్ళతో, నడువని కాళులతో, పగలు రేయియై, రేయి పగలై గడపిన

దినయుగములతో, నడపిన దీక్షావ్రతములతో, ఆత్మయె సాక్షిగ, దైవమె తోడుగ, సత్యమె దిక్కుగ, కడుబడలి యొడలు తెలియని బహుగుబావని శాస్త్రిని జూచుచు గటకటపడువా రెవ్వ రచ్చట?

శాస్త్రిస్థితి కేమి? తెలిసియో తెలియకో చేసినాడ అనుభవించినాడని సామాన్యులు కొందఱు పోలీసువారికి హృదయమే లేదా? ఉన్న దేది? అది దారువా? పాషాణమా? లోహమా? వజ్రమా? అది వీరికి స్పందింపదా? యుగుతింకరు లకైన దయాదాక్షిణ్యము లుండునే వీరిలో మా హృదయ లక్షణమే మాసిపోయినదా? యని భక్తికలవారు మఱికొందఱు పోలీసువారి కార్యదీక్ష, ధైర్య సాహసములు, సత్యాన్వేషణబుద్ధి, ప్రభుభక్తి కాంచి సంత సించి రాజసేవాధురంధరులు కొందఱు ఇది మాయలోకము కాలగర్భమం దెవ్వ రేయిడుమల బడవలసియున్నదో యెవ్వఱి కెఱుక? మనము వట్టి తోలుబొమ్మలము సూత్రధారుడు పర మేశ్వరుడు ఆతనియాజ్ఞ యనుల్లంఘనీయము వీనిజాతకమం దీరీతిని దెబ్బలు తినవలసిన యోగ మున్న దేమో, ఇం దెవ్వరి తప్పును లేదు అను పరమవేదాంతులు కొందఱు నై మాట్లా డుకొన జొచ్చిరి మొత్తముమీద నెవ్వ రేరీతి మాట్లాడినను నంద జీవిషయము నేమాత్రము మాట్లాడుకొన జొచ్చిరి. ఇట్లు

ఒకనాడా? ఒకవారమా? ఒకమాసమా? కాదు ఆరుమాస ములు, అర్ధవత్సరము ఒకే బాధయే ఒకే యమయాతనయే తేళ్ళకలుగులో వాసమా? పాములపుట్టలో బ్రిదుకా? పులుల గుహాలో దల దాచుకొనుటయా? భూతగృహమున బ్రొద్దు పుచ్చుటయా? పోలీసుల యావాసములో నివాసమా? నిత్య యమసందర్శనముతో, ప్రత్యక్షనరకములో బాధపడి, కుమిలి, కృశించి, శల్యమాత్రావశిష్టుడై యెడలో ధైర్యము, చేతిలో ప్రాణము కలిగి యున్సురనుచు బ్రిదికిన వీరుడు శాస్త్రి వీరితో బాటు శ్రమలందినవా రిద్దరు బంగాళాయువకులు ఒక గుజరాతీయువకుడు,ఒక మహారాష్ట్రుడు, వేఱొక్కయాంధ్రుడు వీరందరిపై, కుట్రనేరము పెట్టవలె నను ప్రభుత్వమువారి యాలోచనము సాగలేదు

ఈసమయముననే దేశోద్ధారక నాగేశ్వరరావుపంతులు గారు బొంబాయి కేగి నప్పుడు వీరినందరిని కలిసికొని మూడు వందల రూపాయిలును, గ్రామమందలి పెద్దలకు జాబులను వ్రాసి వారిసానుభూతిని సంపాదింపజేసిరి దానిఫలితముగ వీరు శిక్షింపబడకుండ విడుదల జేయబడిరి

అక్కడనుండి తిరిగివచ్చినపిదప వైద్యవృత్తిని విజృం భింప జేసెను అది యేనాలు గైదువత్సరములు సాగినదో ఇంతలో హోంరూలు హడావడి అంతలో కాంగ్రెసువునరుద్ధ

రణ మతికొంతలో, అల్లూరి సీతారామరాజుగారి గడబిడ సీతారామరాజుతో శాస్త్రికి సంబంధ మున్నదని ప్రభుత్వ మల్లడ తల్లడ పడినది అనుమానము తగిలినప్పుడు వీరిని వీరి గృహమును సోదా చేయుట ప్రారంభించిరి వీరివెంట పోలీసు వారిని త్రైనాతీ వేయుట ప్రారంబించిరి ఈహడావడి 3 సం॥ర ము లుమాత్రము జరిగినది కాంగ్రెసు పునరుద్ధరింపబడినపుడు శాసనసభాబహిష్కారోద్యమమును, నోవోటుకాంపెను ప్రారంభించినప్పుడు శాస్త్రిని, ఉప్పలగుప్తం పోలింగుపరియాలో ప్రచారమునకు బంపగా వీ రొక్కరే ఒక్కవోటుపడకుండ కాళీపెట్టెల తిరుగ గొట్టింప గలిగినారు 1930 లో జిల్లాలోని నాయకులు కారాగారములకు వెళ్ళగా నప్పటికి మిగిలిన పెద్ద లలో నొకరగు బిక్కిన వెంకటరత్నముగారు జిల్లానాయకులుగ నియమింపబడినప్పుడు వా రుప్పుసత్యాగ్రహోద్యమస్థానమైన కాకినాడను వీడి స్వగ్రామమైన చోడవరము వెళ్ళి వారియింటిలోనే యుండి ఈ యుద్యమమును నడుపనెంచి వెడలిపోయిరి కాని శాస్త్రి కాకినాడలోనే యుండి పోయి యీయుద్యమ మును స్వయముగ నడపుట కారంభించినాడు తిరిగి యుద్యమము దిగ్విజయముగ సాగ నారంభించినది ప్రభుత్వము దీనిని గుర్తించిరి కొలదిదినములలో వీనిని నేను జెయిసాలలో కలిసి కొంటిని మే మిరువురమును రాజమండ్రిజెయిలో నుంటిమి

కొలదికాలము గడపినపిమ్మట మమ్ముల నేబదిలోమ్మందుగురను రాయవెల్లూరు జెయిలునకు మార్చిరి అదియే మొదటి జట్టని నాకు జ్ఞాపకము నేను నాశిక్ష నంతను రాయవెల్లూరు జైలునందే గడపితిని శాస్త్రి యక్కడనుండి మద్రాసునకును మద్రాసునుండి అల్లిపురంజైలునకును మార్చబడినాడు

## హిందూదేశ స్వాతంత్ర్యయుద్ధము

ఈ 1930 సం॥ యుద్యమములోను, అంతకుముందు జరిగిన యుద్యమములలోనుగూడ వినాయక దామోదర సావర్కారుగారి "హిందూదేశ స్వాతంత్ర్యయుద్ధము" అను గ్రంథము విరివిగ బ్రచారములోనికి వచ్చినది ఈగ్రంథము మొదట 1906, 1907 సం॥రములలో మహారాష్ట్ర భాషలో వ్రాయబడినది. 1907 సం॥రములో నింగ్లీషుభాషలోనికి దర్జుమా చేయబడినది 1908 సం॥రములో జర్మనీలో ముద్రింపబడినది బొంబాయిలో క్రొత్తగా పెట్టబడిన దామోదరుకంపెనీవారికి పాలడబ్బాలవ్యాపారము కలదట వీరు సరకు జర్మనీనుండికూడ దిగుమతి చేసికొనుచుండువారట. ఒకనాటి సరకులలో పాలడబ్బాలలో 'హిందూదేశ స్వాతంత్ర్యయుద్ధము' అను గ్రంథపుప్రతులు వచ్చినవట శాస్త్రి బొంబాయివెళ్ళి

యవి కొన్ని తెచ్చినాడట ఆద్వారమున నాగ్రంథము లాంధ్ర దేశము . కందిపోయినవి

హిందూదేశరాజకీయములు గాంధీగారినాయకత్వము క్రింద నుండినను వివిధరూపములు దాల్చుచు వచ్చినవి అందుచే సత్యాగ్రహోద్యమము విరమింపబడి శాసనసభాప్రవేశోద్యమము తీవ్రరూపమును దాల్చినప్పటినుండియు శాస్త్రి గాంధీగారి యీపరిణామికలోనుండి తప్పుకొనెను. వినాయక దామోదర సావర్కారు నాయకత్వముక్రిందకు వచ్చిన హిందూమహాసభలో సభ్యునిగ జేరి పనిచేయు ప్రారంభించెను వినాయక దామోదర సావర్కారు వ్రాసిన హిందూపదపాహీ యను గ్రంథమును బహుమృదుమధుర శైలిలోనికి సంపూర్ణముగ తర్జుమా జేసియుండెను హిందూమహాసభానిర్ణయముల బాటించుచు హిందూమతోద్ధరణముగూడ చాల ముఖ్యమైనదను నమ్మకముతోనుండి యీహిందూమహాసభకు సంపూర్ణ సానుభూతిని జూపుచుండెను ఇందులకై యాతడు విశేషగ్రంథ పరిశోధనముగూడ జేసెను ఒకనాడు తానొక గ్రంథమును దెచ్చి నాచేత బెట్టినాడు ఆగ్రంథముపేరు Gandhi Muslim Conspiracy ఆగ్రంథమును చదివినపిదప తనలో కలిగిన మార్పును చెప్పినాడు కొంతవిషయము గ్రంథము నుండి చదివి వినిపించియున్నాడు గాంధీగారు హిందూదేశ

మును మహమ్మదీయులకు కైవశము చేయుచున్నాడని శాస్త్రి అభిప్రాయపడినాడు ఆగ్రంథములోని పేరాల నుదహరించు చున్నాను

"Maulana Mahammad Ali complained about political leaders taking him to task for sending a wire to the Sultan of Kabul, urging him not to make peace with the British Government I too urged that it was not a wise step that he had taken Brother Mahammad Ali took me aside and taking out a paper from his hand bag gave a draft of a telegram to me to read What was my astonishment when I saw the draft of the self same telegram in the peculiar hand writing of the father of the non-violent non-co-operation movement"

Mahatmajis reply to the above is published in Harijan of 10—2—1940

"I do not remember having drafted any telegram on behalf of Maulana Mahomed Ali to the then Amir The alleged telegram is harmless in itself and does not warrant the deduction drawn from it The late Swamiji never reffered the matter to me for confirmation [*Gandhi Muslim Conspiracy Page 7*]

"బ్రిటిషుప్రభుత్వముతో సంధి చేసుకొనవలదని నేను కాబూలులోని సుల్తానుగారికి తంతివార్త నిచ్చితినని రాజకీయ నాయకు లందఱు నామీద కక్ష వహించుచున్నారు నేను కూడా అది మంచిపని కాదని చెప్పియున్నాను కాని సోద రుడు మహమ్మదాలి నన్ను ప్రక్కకు తీసుకొనివెళ్ళి తనచేతి నంచిలోనున్న వ్రాతప్రతియగు తంతిని తీసి నాచేతికిచ్చి చదవ మని చెప్పినాడు ఆతంతి దౌర్జన్యరాహిత్య సహాయనిరాకర ణోద్యమమునకు నిర్మాత యగువాని దస్తురీలో నుండుటచూచి నే నత్యాశ్చర్యము నందితిని" అని స్వామి శ్రద్ధానందుడు వ్రాయగా దానికి గాంధీగారు తమ హరిజనపత్రికలో ది 10_2_1940 నం॥ తేదీని "నేను మౌలానా మహమ్మదాలి గారికి ఆఫ్ఘన్‌స్థానపు అమీరుగారికి పంపుటకై యే తంతి యును వ్రాసి యిచ్చినట్లు జ్ఞాపకము లేదు నేను వ్రాసితినని యారోపింపబడిన తంతి ప్రమాదకరమైనదిగాని, అందుండి సారాంశములు గ్రహింపవలసినదిగాని కాదు చనిపోయిన స్వామిజీ (శ్రద్ధానందస్వామి) నా కీవిషయమును నిర్ధారణకొఱకు ము న్నెన్నడు తెలియపఱచియుండలేదు" అని గాంధీగారు సమాధానమిచ్చిరి

ఇది యిటుండ నిమ్ము

"It is the Muslims who will impose their will by force singly or with British assistance

on an unresisting India If I can carry the congress with me I would not put the Muslims to the trouble of using force I would be ruled by them for it would still be Indian rule"

[*Harijan of 23—3—1940*]

"ఎదిరింపని హిందూదేశముపై బ్రిటిషుప్రభుత్వమువారి సహాయ్యముతో గాని మహమ్మదీయులు తమంత తాముగాని శక్తిని వినియోగింతురు నేను కాంగ్రెస్సును నావెంట తీసికొని పోగలుగుదునేని మహమ్మదీయులకు శక్తి నుపయోగింపవలసిన శ్రమ నీయదలచుకొనలేదు నేను వారిచే పరిపాలింపబడుదును ఎందులకనగా ఆపరిపాలన మొకను హిందూపరిపాలనమే"

అని గాంధీగారు హరిజనపత్రికలో ది 23-3-1940 సం॥రం తేదీని వ్రాసిరి

"ఇందుచే హిందూదేశములో గాంధీగారు తిరిగి మహమ్మదీయులకు చేయూతగ నున్నాడు నా కది యొంతమాత్రమిష్టము లేదు పైశత్రువైన బ్రిటిషుప్రభుత్వముకంటె నింటిలోని శత్రువగు మహమ్మదీయుల సమస్య పరిష్కరించుకొన దలచి నేను హిందూమహాసభాసభ్యునిగ చేరియున్నాను" అని శాస్త్రి విస్పష్టముగ తనరాజకీయదృక్పథమును మార్చుకొని నట్లు చెప్పినాడు మరియు తాను "హిందూమహాసామ్రాజ్య"

మను గ్రంథమును తెనిగించుటకు ముఖ్యకారణము హైందవో త్కృష్టత నిరూపణము చేయుటయనియు అదియే తన యా శయమనియు గూడ వాకొనియున్నాడు

## వీరిగుణములు

ఆంధ్రరాష్ట్రములోనికి జొరబడిన నూతనరాజకీయపక్ష స్వీకరణమే వీని యాశయముగా గాన్పించుచున్నది ఇతడు దేశాభిమాన, మతాభిమానములలో నగ్రగణ్యుడు

మంచి యావేశపరుడు ఉపన్యాసకుడు విప్లవకారుడు

# అయ్యదేవర కాళేశ్వరరావు-సంస్కర్త

## బాల్యము

శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు విక్రమనామ సం॥ర పుష్యమాసములో అనగా 1881 జనవరిలో కృష్ణజిల్లాలోని నందిగామతాలూకా నందిగామగ్రామములోని స్వగృహము నందు జన్మించెను ఇతడు నియోగిశాఖకు జెందిన భారద్వాజస గోత్రజుడు ఈయన తండ్రిగారు మునగాల జమీందారుగారి వద్ద మేనేజరుగా పనిచేసిరి తాతగారు నందిగామకు జమీం దారికరణముగా పనిచేసిరి వీరుభయులు మంచిసమర్థులని పేర్వడసిరట తల్లి వరలక్ష్మమ్మగారు చక్కని ఆర్యధర్మముల నలవఱచుకొనిన యువతి అతిథిసత్కారమున డొక్కా సీత మ్మగారికి తీసిపోలేదని పెద్దలు చెప్పుదురు

కాళేశ్వరరావు తల్లిదండ్రులకు గారాబు ముద్దుబిడ్డ ఈపుణ్యదంపతులకు చాలమంది కలిగినను సజీవులై దినదిన ప్రవర్ధమానముగ నెదిగినవాడు కాళేశ్వరరావు ఒక్కడే! ఇతడు బాల్యములోనే నాల్గవతరగతి పరీక్షయం దుత్తీర్ణుడయి

తాతగారివద్ద కరిణీకపులెక్కలలో నేర్పరి యయ్యెను ఇంగ్లీషు లెక్కలుకూడ నిత డప్పుడు నేర్చుకొనక పోలేదు నందిగామ యితని కంతవఱకే విద్య నొసగగలిగినది ఇతనికి 14 వ యేట నందిగామతాలూకాలోని కలవచర్లకరణం పింగళి వీరభద్రియ్యగారి కూతురగు దుర్గాంబ యను పదిసంవత్సరముల కన్య నిచ్చి వివాహము గావించిరి ఈమె తనయత్తగారి యడుగు జాడలలో నడచుచు నుత్తమయిల్లాలని పేర్వడసినది అయ్యదేవరవారియింటి కీమె దీపమై శోభను తెచ్చినది భారతభాగవతాదిగ్రంథముల జదువుకొనుచు భర్తకు చేదోడు వాదోడుగ నుండి యతని సర్వవిధముల నర్ధాంగియై యలరారుచు వచ్చినదట కాని సంతానము కలుగలేదు

## విద్య

కాశేశ్వరరావు వివాహమును చేసుకొనినపిదప నింగ్లీషువిద్య నభ్యసించుటకై బందరునకు వెడలెను 1894 సం॥రమున జూన్ నెలలో బందరు నోబుల్ కళాశాలలో మూడవ ఫారములో జేరెను కాని పరీక్షరోజులలోనే కాని పుస్తకము లెచ్చట నున్నవో యిత డెరుగడు ఆటపాటలయందు నభినివేశము మెండయినది అట్లని విద్య నలవఱచు కొనకపోలేదు మంచితెలివి గలవాడని యుపాధ్యాయు లితనిని గుర్తించిరి అట్లే ప్రతిసంవత్సరము పైతరగతికి పోవుచు వచ్చెను

అన్నితరగతులలోను ప్రథమునిగ నుత్తీర్ణుడయి పెక్కు బహుమతులు పొందియున్నాడు 1901 సం॥రమున బి యే యందుత్తీర్ణు డయ్యెను. గణితశాస్త్రములో మంచి ప్రవీణుడు యఫ్ యే పరీక్షలో నుత్తీర్ణుడయి లెక్కలలో బి యే చెన్న పట్నములో చదివి ప్యాసయినపిదప నింజనీయరింగు కళాశాలలో చేరవలెనని తలచెను కాని వీరితండ్రిగారు కాకోరికను సాగనీయక బందరులోనే చదువమని నిర్బంధించెను బందరులో చరిత్ర, ఆర్థికశాస్త్రము, రాజకీయశాస్త్రముల శాఖమాత్రమే కలదు దానినే కాళేశ్వరరావు చదివి యు త్తీర్ణుడయ్యెను రాజకీయశాస్త్రము (Political Science) పొలిటికల్ సైన్సులో మంచి యభినివేశమును సంపాదించెను గొప్ప బుద్ధిసూక్ష్మత కలవాడని వారియుపాధ్యాయులు మెచ్చుకొనుచుండెడివారు. బి యే పరీక్షయం దుత్తీర్ణుడు కాగానే కళాశాలయొక్క పత్రిక రత్నపతక మితని కివ్వబడెను 1902, 1903 సం॥రములలో నోబుల్ కళాశాలలో చరిత్రకును, గణితమునకును ఆచార్య స్థాన మలంకరించెను. ఆకాలమున విద్యార్థులలో మంచిపలుకుబడి సంపాదించెను 1904, 1905 లో మద్రాసులో 'లా' చదివెను

ఇతడు కళాశాలలో చదువుచున్న సమయమున (Students debating Society) విద్యార్థుల చర్చాసంఘ

ములో పాల్గొనుచుండెడివాడు కళాశాలకు సంబంధించిన నాటకములలో ముఖ్యపాత్రముల ధరించుచుండెడివాడు. వీరి యభినయాదులు బాగుగ నుండుట జూచి బందరులో నూతనముగా స్థాపింపబడిన హిందూనాటకసమాజమువా రితనిని నటకునిగ జేర్చుకొన ప్రయత్నించిరి. ఇతనికిని జేరవలెనను నుత్సాహముండెడిదిగాని యితని కాచార్యపురుషులైన రఘుపతి వేంకటరత్నంనాయుడుగారు వలదని వారించుటచే నాటకసమాజములో జేరక మిన్నకుండెను. పిమ్మట బెజవాడలో లాయరుగా పనిచేయుచున్నకాలములో మూడు నాలుగుసంవత్సరములు స్టారు థియేటరులో నాటకసమాజమున కధ్యక్షుడుగ నుండెను కాని యేవిధముగ పాత్రలను ధరించలేదు

## సంఘసంస్కరణము

రఘుపతి వేంకటరత్నం నాయుడుగారి శిష్యులై సంఘసంస్కర్తలైనవారలలో కాశీశ్వరరావు ఒకడు. నాయుడుగారి శిష్యులైనవారు పెక్కండ్రు సంఘసంస్కర్తలుగ మారిరి. నాయుడుగారు బందరులో పనిచేసినప్పుడే గాక కాకినాడ కళాశాలలోకూడ పనిచేసినప్పుడు వీరివిద్యార్థులు సంఘసంస్కరణాభిలాషులై బ్రహ్మసమాజకులైరి. వీరి శిష్యులలో నేకొలదిమంది రాజకీయవిజ్ఞానమును సంపాదించిరోగాని మిగిలిన వారందరు

సంఘసంస్కరణమునందు ముఖ్యులుగనుండి పనిచేసి నాయుడు గారిశిష్యులను బిరుదముల నార్జించుకొనిరి ఈసంఘసంస్కరణము నాయుడుగారిలోని ప్రత్యేకలక్షణము ఈసంఘసంస్కరణమువలన దేశ మెంత ముందునకు వచ్చినదో చెప్ప లేనుగాని పెక్కండ్రు వారిశిష్యులై సంఘసంస్కరణమునకు దారితీసిరని చెప్పవలెను అట్టిమార్గమున సంచరించినవారలలో కాళేశ్వరరావు ఒకడని చెప్పియున్నాను ఈయన హైస్కూలులోను కళాశాలలోను చదువుకొనుచున్నకాలము మత, సంఘసంస్కరణలకు ప్రసిద్ధి కెక్కిన కాలము బందరులో బ్రహ్మసమాజము, ఆర్యసమాజము, దివ్యజ్ఞానసమాజము, హిందూసమాజము, చురుకుగా పనిచేయుచుండెడివి వారివారినాయకులు వచ్చి యుపన్యాసముల నిచ్చుచుండెడివారు క్రైస్తవబోధలు కూడ జరుగక పోలేదు ఆనాటిసంఘసంస్కర్తలలో వేంకటరత్నం నాయుడుగారు శిఖామణి పైగా వా రాచార్యపురుషులు అందుచే వారిబోధలు కాళేశ్వరరావుకు బాగుగ రుచించి వారిశిష్యుడై సంఘసంస్కర్త యయ్యెను ఈయన దేశసేవాపరాయణత్వమునకు నాయుడుగారు కారణభూతులు కారు 1905, 6, 7 సంవత్సరములలో వచ్చిన తీవ్రరాజకీయాందోళనము వంగదేశవిభజనమువలన దేశసేవాభిలాష కలిగినది ఆతుపానులో రాజకీయ మాంధ్రదేశమునకుకూడ

కొట్టుకొని వచ్చినది అయాందోళనము లో జేరి పనిచేసి వారికి రాజకీయ మబ్బినదిగాని , వేంకటరత్నంనాయుడుగారి వలన రాజకీయమగు దేశసేవాపరాయణత్వ మలవడినదని తలం చుట ధర్మము గాదు రాజకీయాందోళనముతో గూడిన దేశ సేవాపరాయణత్వమునకు రాజకీయములే మానవుని దృక్పథ మును మార్చుటకు కారణభూతము లగునుగాని వే రేదియు గాదు కాశీశ్వరరావు దేశసేవాపరాయణత్వమునకు కారణ ములు వేరొకప్రకరణమందు వ్రాయుదును

రాజారామమోహనరాయలు, వివేకానంద, రామ కృష్ణపరమహంస, సీతానాథతత్వభూషణ మొదలగువారి గ్రం థములను చదివి వారి సంఘసంస్కరణాభిప్రాయముల చూర గొనెను మిషనరీకళాశాలలైన నోబుల్ కాలేజిలో బైబిలు ప్రతివిద్యార్థి చదివితీరవలెను అట్లే ఈయనకూడ బైబిలు చదివి బహుమతుల పొందుచు వచ్చిరి

ఈయన కీసంఘసంస్కరణాభిప్రాయములకు తోడుగ కీ శే కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారి స్నేహము, బాంధవ్యము లభించెను, చెన్నపట్టణములో క శే కందుకూరి వీరేశలింగం గారిస్నేహము లభించెను లక్ష్మణరావుగారి మేనమామ భం డారు దండపాణిగారు వితంతూద్వాహము చేసికొని వీరియింట కొన్నినాళ్ళుండి యుండెను వీర లందరిస్నేహభాగ్యముచే

శాశ్వేశ్వరరావు సంస్కర్త యయ్యెను కందుకూరి వీరేశలింగం గారి ప్రార్థనాసమాజము, కొమర్రాజు లక్ష్మణరావుగారి సహాధ్యాయత్వము, పంచముల రాత్రిపాఠశాలలో సహోపాధ్యాయత్వము ఇతనిసంఘసంస్కరణాభిమానమును నినుమడింప జేసెను ఆకాలములోనే గుంటూరులో వితంతూద్వాహముల జరిపించుచూ సంఘసంస్కరణోద్యమమును నాల్గుపాదముల నడిపించుచున్న ఉన్నవ లక్ష్మీనారాయణగారితో నితడు కలిసి పనిచేయుచుండెడివాడు బెజవాడలోని హరిజనవసతిగృహమున కితడు చాలకాల మధ్యక్షుడుగా నుండెను

ఈయన జాతిమతకులవిభేదముల పాటింపక భోజనాదికముల గావించుచుండెడివాడు వీరియింట మొదటినుండియు హరిజనుడే యింటిసేవకునిగ నుండి సమస్తకార్యములలో పాల్గొనుచుండును కులభేదములు వీలయినంత త్వరగా కూకటివేళ్ళతో పోవలెననియే శాశ్వేశ్వరరావు సిద్ధాంతము వివిధమతస్థులమధ్యగూడ నంతర్వివాహముల నంగీకరింపుచు నుపన్యాసాదికముల నిచ్చుచుండెడివాడు సర్వమానవుల సమానత్వము సోదరత్వము, ఏకేశ్వరోపాసనము ఈయన కభిమానవిషయములు ఈమూలసూత్రములు విటీవల నీయన వ్రాసిన యువనివత్సరములలో స్పష్టీకరించిరట హరిజనపాఠశాల నొక దానిని స్వంతఖర్చులమీద పెక్కువత్సరములు నడపి హరిజనో

ద్యమములో ప్రముఖస్థానమును వహించెను 1916 సం॥రమున రామమోహన గ్రంథాలయములోనికి హరిజనులను రానీయ గూడదని పూర్వాచారపరాయణులు గావించిన యాందోళనము నెదుర్కొని ధారాళముగ వారిని గ్రంథాలయములోనికి వచ్చునట్లు చేసెను 1917 సం॥రమున వీరి సహాయ్యమున ప్రథమ ఆదిమాంధ్రమహాసభ భాగ్యరెడ్డివర్మగారి యధ్యక్షత క్రింద బెజవాడలో జరుపబడెను. ఈహరిజనోద్యమములో రాయుడు గంగయ్య, జి రామచంద్రరావు, వెల్లంకి కృష్ణమూర్తి, వేమూరి రాంజీరావు, చుండ్రు వెంకయ్యగార్లు వీరి కాప్తమిత్రులైరి వితంతూద్వాహము, రజస్వలావివాహము, విదేశగమనము, హరిజనుల అస్పృశ్యతానివారణము గావించుచున్న కాళేశ్వరరావును వారిమిత్రులను 1907 నుండి 1909 వఱకు నాటిసంఘము వెలివేసినది కాని నాటియువక బృందము కాళేశ్వరరావుపక్షము వహించుటచే వెలి నిష్ప్రయోజన మైనదట

ఆకాలములోనే కీర్తిశేషులయిన కొమర్రాజు లక్ష్మణరావుగారి అక్కగారు భండారు అచ్చమాంబగారు విదుషీమణియై యబలాసచ్చరిత్రరత్నమాల యను గ్రంథమును రచించి ప్రకటించెను ఈగ్రంథ మాకాలములో ప్రజల సందతి నాకర్షించెను ఆమె తనభర్తతో కూడా పూనానగరము

నుండి బందరు వచ్చి కాళేశ్వరరావుయింట నతిథిగా నున్న వ్వుడు కాళేశ్వరరావు నితరమిత్రులు కలసి చాలమంది స్త్రీలను ప్రోగుచేసి స్త్రీల సభ జరిపించిరి ఆమె యుపన్యాసఫలితముగ బృందావనస్త్రీసమాజ మేర్పాటయినది ఆమె ఆంధ్రదేశములో సంచారము చేసి పెక్కుచోట్ల స్త్రీసమాజముల నెలకొల్పెను కాళేశ్వరరావు లాయరైన పిదప, బెజవాడ మొదలగుచోట్ల స్త్రీ సమాజములకు మంచిప్రోత్సాహమిచ్చెను. ఈరీతిగ కాళేశ్వరరావు సంఘసంస్కరణమును నాచరణలో బెట్టెను

## వీని దేశసేవాపరాయణత్వము

కాళేశ్వరరావు విద్యార్థిగానున్నప్పుడు రాజకీయవిషయములనుగూర్చి చదివెను రొమేశచంద్రదత్తు, దాదాభాయి నౌరోజీ, రెనడె, తిలాంగు మొదలగువారి యార్థికగ్రంథములు చదివెను గాంధీగారు దక్షిణాఫ్రికాలో భారతీయుల హక్కులకై జరుపుచున్న సత్యాగ్రహముయొక్క దినదినాభివృద్ధి పత్రికలలో శ్రద్ధగాచదివి భావోద్రేకమును పొందుచుండెను

1905, 6 సంవత్సరములనుండియు బంగాళావిభజనములోనుండి గొప్పజాతీయోద్యమము విజృంభించెను అచట బంగాళావిద్యార్థులు స్వదేశీవ్రతమువూని స్వదేశవస్త్రములను

స్వదేశనరుకుల నింటింటికి గొంపోయి అమ్ముచు నాంగ్లేయవస్తు బహిష్కారమును బోధించుచుండిరి కాని మదాసులో పెద్దలు మేల్కొనలేదు విద్యార్థులైన కాశేశ్వరరావు, హరి సర్వోత్తమరావు, గొల్లపూడి సీతారామశాస్త్రి, దొరస్వామి అయ్యర్, చకరయ్యచెట్టి మొదలగువారును స్వదేశమిత్రన్ పత్రికలో సహాయసంపాదకుడుగనున్న కి శే సుబ్రహ్మణ్య భారతిగారునుకలిసి ఒకగొప్ప విద్యార్థిమహాసభను సముద్ర తీరమున గావించి జాతీయోద్యమమును బలపరచుచు బంగాళా విద్యార్థుల నభినందించుచు నుపన్యాసముల నిచ్చిరి దానికి హిందూ, స్వదేశమిత్రనుపత్రికల స్థాపకులును నగు జి సుబ్రహ్మణ్యఅయ్యరుగా రధ్యక్షత వహించిరి దీపావళిభిక్షలు వసూలుచేసి స్వదేశపరిశ్రమలు చదువుకొనువారికి విద్యార్థి వేతనముల నిచ్చిరి అపుడు వీ రందరిచేతను స్వదేశదీక్ష గైకొనబడెను అప్పటినుండియే దృఢమైన జాతీయవాది యయ్యెను అప్పటినుండియే దేశసేవాపరాయణత్వ మలవడినది

## ఈతని న్యాయవాదితనము

1908 సం॥రమున ఈతడు మద్రాసులో బి యెల్ పరీక్షలో కృతార్థుడైనపిమ్మట గుంటూరులో వకీలుగాను, రాజకీయనాయకులుగాను పనిచేయుచున్న శ్రీకొండా వెంకటప్ప

య్యపంతులుగారివద్ద మూడునెలలు పనినేర్చుకొనివచ్చి జూన్ నెలలో బెజవాడలో న్యాయవాదివృత్తి నెలకొల్పెను. అట్లు న్యాయవాదివృత్తిని నెలకొల్పిన కొలదికాలములో ప్రభుత్వములో గొప్పయుద్యోగములోనున్న ఈయనమిత్రు లొకరు రివెన్యూడిపార్టుమెంటులో గౌరవమైన యుద్యోగ మిచ్చెదనని వార్త నంపించెను. కాశేశ్వరరావు దానిని నిరాకరించెను. ఆజిల్లాలోనేయున్న జమీందారు వీరిని తనకు దివాంజీగా పని చేయుమని కోరిరి. కాశేశ్వరరావు దానినికూడ నిరాకరించెను. ఇట్టియుద్యోగములు వారి మనస్తత్వమునకు సరిపడవనియు, స్వతంత్రవృత్తి నవలంబించెదననియు కాశేశ్వరరావు సమాధాన మిచ్చుచు వచ్చెను.

కాశేశ్వరరావు న్యాయవాదివృత్తిలో నతిత్వరితముగనే యుగ్రస్థానమును వహించెను. మంచిసమర్థుడని పేరుగాంచెను. సివిలు, క్రిమినలు, రెవెన్యూ మొదలగు వివిధశాఖలకు సంబంధించిన కేసులలోసమానముగా పనిచేయుచు వచ్చెను. అనేక మంది జమీందార్లు, ఇతరజమీందార్లతో పోరాడుచున్న రైతువర్గము, ఈయనకు క్లయింట్లయిరి. మద్రాసు మెజిస్ట్రేట్సు లాంటు ఆక్టుగూర్చి విశేషానుభవము ఈయనకు కలదు. ఆ విషయములో నీతడెక్కుడు కృషిసల్పెను. ఈవిధముగ 15 సంవత్సరములు న్యాయవాదివృత్తి జేసి ధన మార్జించు కొనెను.

1921 సం॥ రమున గాంధీగారి సత్యాగ్రహోద్యమములో ప్రవే శించునప్పటికి ఎలమఱ్ఱు మెస్సేట్సు వారి పదివేలరూపాయిలు ఫీజువచ్చే దావాయును యిరువదియైదు వేలు ఫీజులువచ్చే యితర దావాలును నీయనవద్దనున్నవని తెలియువచ్చునది ఇన్నిటికిని స్వస్తిచెప్పి సహాయనిరాకరణవాదిగా మారెను ఆనాటినుండి ఈయన తనవృత్తిని విసర్జించెను దానికై జీవితములో తిరిగి వెనుకకు చూడలేదు ప్లీడరీపట్టాను పొడిగించుకొనలేదు దేశ స్వతంత్రపోరాటములో త్వరలోనే కారాగారములకు పోవలసి యుండుననియు, నీపోరాటము లొకటి రెండు సంవత్సరము లలో తేలిపోవక చాలకాలము పట్టుననియు, ఆపోరాటమున కెల్లకాలము సర్వసిద్ధముగ నుండవలసినదేగాని వెనుకంజ వేయ గూడదనియు నీయన యాశయములు అందుచే నెన్నడు తిరిగి న్యాయవాదివృత్తిలో ప్రవేశింపలేదు ఎల్లకాలములందునను పోరాటమునకు సర్వసిద్ధముగ నుండెను నాటినుండి నేటివర కును కారాగారములకు పోయి వచ్చుచునే యుండెను ఈపో రాటము జీవితాంతమువరకు కూడనుండవచ్చునను నమ్మకము తోనే కాశేశ్వరరావు సత్యాగ్రహోద్యమములో ప్రవేశిం చెను కొలదిమాసములలోనో కొలదిసంవత్సరములలోనో బ్రిటి షుప్రభుత్వము మనకోర్కెల నతిసులభముగ నీడేర్చి స్వరా జ్యము నొసగెదరను తలంపుతో కాశేశ్వరరావు ఎన్నడును

లేడు ఇతడు ధన మార్జించినకాలములలో నౌదార్యమువల్లను, దానధర్మములవల్లను గడించినది ఖర్చుపెట్టుకొనుటచే తదనంతరజీవితమునకై పిత్రియమునుగూడ వ్యయపఱచుచువచ్చెనట.

న్యాయవాదిగా 1906 నుండి 1921 సం||రము వరకుగల కాలములో నాంధ్రదేశమునకు మధ్యస్థమైన బెజవాడలో సంఘసంస్కరణ నాచరణలో పెట్టెను, విజ్ఞానాభివృద్ధి కలుగజేసెను కాంగ్రెస్సుసంస్థలలో ప్రధానపాత్ర మయ్యెను. వందేమాతరం వుద్యమంలోను, హోంరూల్ వుద్యమములోను వ్యాసములు, ఉపన్యాసములమూలమున ఈతడు తీవ్రముగ ప్రచారము చేసెను ఈతని వ్యాసములు పెక్కులు బందరులోని కృష్ణాపత్రికలో ప్రకటితములు

## ఈతని వివిధరాజకీయోద్యమములు

ఈతడు 1906 సం||రమున వంగదేశవిభజనము జరిగినప్పుడు మద్రాసులోనుండి పనిచేయుచున్నాడని పైని పేర్కొనియున్నాను ఈతడు 1906 లో మద్రాసునుండి బెజవాడకు వచ్చినపిదప నచ్చట గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారితో కలిసెను 1908 సం||రమున హరిసర్వోత్తమరావు తమస్వరాజ్యపత్రికలోవ్రాసి ప్రకటించిన రాజద్రోహకరమైన వ్యాసమును అందుకై హరిసర్వోత్తమరా వొకసంవత్సరమువరకమనుభ

వించుటయు, శ్రీజగ్గన్న శాస్త్రిజీవితచరిత్రలో వ్రాసియేయుంటిని ఆహారినర్వోత్తమరావుగారితో కాశీశ్వరరావుకి కలిగిన మైత్రియు, ఆహారిసర్వోత్తమరావుగారి స్వరాజ్యపత్రికకు కాశీశ్వరరావువ్రాసిన వ్యాసములను ప్రభుత్వమువారిదృష్టిని కాశీశ్వరరావువైవునకు మరల్చినవి కాశీశ్వరరావుపైగట్టి నిఘా వేసిరి 1908 సం॥రమున బంగాళాదేశమునుండి యొక విప్లవకారు డాంధ్రదేశమంతయు సంచారము గావించుచు బెజవాడకువెడలి కాశీశ్వరరావు బృందమును కలుసుకొని తాము వంగరాష్ట్రములో గావించుచున్న విప్లవోద్యమములో చేరవలెనని కోరెనట కాశీశ్వరరావు తా మాసంఘములో చేరజాలమనియు, సాత్వికనిరోధమువరకే తాము సిద్ధపడి యున్నామనియు చెప్పెనట అప్పు డావంగదేశీయుడు కాశీశ్వరరావుని వీడి వెడలిపోయెనుగాని పోలీసువారుమాత్రము కాశీశ్వరరావుని వీడియుండుట కుత్సహింపక నాతని చాలాకాలము "నిఘా"లో నుంచిరి

ఈయుద్యమానంతరమందువచ్చిన హోంరూలులీగులో కాశీశ్వరరావుకూడ పనిచేసెను 1917 సం॥రములో ఆనిబెసెంటుప్రభృతుల విడుదలకొఱకు సిద్ధపఱుపబడిన సాత్వికనిరోధ ప్రమాణపత్రమును గైకొని పనిచేసెను 1917 సం॥రమునుండియు నెడతెగకుండ అఖిలభారత కాంగ్రెస్సు కమిటీలో సభ్యు

డుగ నుండెను 1919 లో రౌలటుచట్టపు సత్యాగ్రహ ప్రమా ణమును గైకొనెను 1919 లో నే మహాత్మాగాంధీగారు బెజవాడలో నొక దిన మాగి వీరింట నతిధిగనుండి బెజవా డలో రౌలటుచట్టమునుగూర్చి యుపన్యసించి వెళ్ళిరి 1920 సం॥రమున మరల గాంధీగారును, షౌకతాలీగారును, కలకత్తా ప్రత్యేక కాంగ్రెస్సు సమావేశమునకు బోవుచు త్రోవలో బెజవాడలోనాగి కాశేశ్వరరావుయింట నతిధిగానుండి తాము సాగింపబోవుచున్న దౌర్జన్య రాహిత్య సహాయ నిరాకరణ మును గూర్చి యుపన్యసించి వెళ్ళిరి ఆసభలోనే జాతీయపక్ష మున మద్రాసు శాసనసభ కభ్యర్థిగా నిలచి పనిచేయుచున్న కాశేశ్వరరావు తమయభ్యర్థిత్వమును వదలుకొనిరని మహా త్ములు ప్రకటించిరి 1920 సం॥రమున కలకత్తా కాంగ్రె స్సులో కాశేశ్వరరావు బృందము గాంధీగారి పక్షమునే బల పఱచి ఓటు జేసెను అప్పటికి లాలాలజపతిరాయి, సి ఆర్ దాసు, ప్రభృతులేగాక, ఆంధ్రకాంగ్రెస్సునాయకులు కొం దఱుగూడ గాంధీగారి ప్రణాళికకు వ్యతిరేకులుగనే యుండిరి

## ఆంధ్రోద్యమము

ప్రథమమునుండియు కాశేశ్వరరావుకూడ మిగిలిన యాంధ్రప్రముఖులతో బాటు నాంధ్రోద్యమములో పాల్గొను చుండెను 1914 సం'లో బెజవాడలో జరిగిన రెండవ యాం

ధ్రిమహాసభకు కాళేశ్వరరావు "జనరల్ శెక్రిటరీ" ముఖ్య కార్యదర్శిగా నుండి పనిచేసెను 1917 సం॥లో బెజవాడలో జరిగిన ప్రత్యేకాంధ్రరాష్ట్ర మహాసభ కావ్యానసంఘాధ్యక్షత వహించెను 1934 సం॥రమున విశాఖపట్టణమున జరిగిన యాంధ్రరాష్ట్రమహాసభ కీయన యధ్యక్షుడు రాష్ట్రవిషయములో పెక్కుసంవత్సరములనుండి విశేషపరిశ్రమ జేసినవాడగుటచే నాంధ్రరాష్ట్రావశ్యకతనుగూర్చి చక్కగ నుపన్యసించెను ఉపన్యసించుటయే గాదు చెప్పిన సర్వవిషయములు, సోదాహరణపూర్వకముగా లెక్కలతో సహా చూపి రాష్ట్రావశ్యకత నుద్ఘోషించెను ఈయన యీయుపన్యాసమును హిందూ పత్రిక కొనియాడినదట 1931 సం॥రమున గాంధీమహాత్ముడు రెండవ రౌండుటేబిలు కాన్ఫరెన్సునకు వెళ్ళునప్పుడు కాళేశ్వరరావు ఆంధ్రరాష్ట్రకాంగ్రెస్సు జనరల్ శెక్రిటరీగ నాంధ్రరాష్ట్రావశ్యకతనుగూర్చి యొక నివేదికను మహాజరును సమర్పించెను మహాత్ముడు స్వరాజ్యసమస్య జయప్రదముగ కొనసాగునేని యాంధ్రరాష్ట్రసమస్యనుగూర్చి తప్పక ప్రస్తావించి మీకు సర్వవిధముల మే లొనగూర్తునని వాగ్దానము చేసెను.

## విజ్ఞానచంద్రికాగ్రంధమండలి—రచనలు

1907 సం॥రమున జాతీయోద్యమము ప్రజలలో బాగుగా వ్యాపించుటకును, ప్రజలలో నిజమైన విజ్ఞానము కలు

గుటకును, నవీనవిజ్ఞానము నిచ్చు గ్రంథములు, ఆంధ్రభాషలో ప్రచురించుటకును విజ్ఞానచంద్రికాగ్రంథమండలిని కొమర్రాజు లక్ష్మణరావుగారు, కాశీశ్వరరావు, హరిసర్వోత్తమరావుగారు, మునగాలరాజా, రావిచెట్టి రంగారావుగార్లచే స్థాపింపబడినది కాశీశ్వరరావు హరిసర్వోత్తమరావుగార్లు గ్రంథమండలికి ప్రథమ కార్యదర్శులు పిమ్మట డాక్టరు ఆచంట లక్ష్మీపతి గారు దీనిలో చేరిరి ఆగ్రంథమండలి చరిత్రలు, ప్రకృతి శాస్త్రములు, చరిత్రాత్మకనవలలు, మహాపురుషుజీవితములు మొదలగు నలుబదిగ్రంథములు ప్రచురించి నిలచిపోయినది ఈమండలికి ప్రాణము లక్ష్మణరావు, లక్ష్మీపతిగార్లనియే చెప్ప నొప్పును కాశీశ్వరరావుకు మొదటిదశలో గ్రంథములు వ్రాయుటకు తీరికలేకపోయెను గాని 1922 లో నొక సంవత్సరము, 1930 లో నొక సంవత్సరము కారాగారవానము ప్రాప్తించినప్పుడు ఫ్రెంచివిప్లవచరిత్రమును, అమెరికాసంయుక్తరాష్ట్రములు- తురుష్క-ప్రజాస్వామికములు అను గ్రంథములను వ్రాసి విజ్ఞానచంద్రికా గ్రంథమండలి పక్షమున ప్రచురించెను.

1932 సం॥రమున కారాగారవాసశిక్ష ననుభవించుచున్నకాలములో చైనాజాతీయోద్యమ మను గ్రంథమును రచించెను అది కాకినాడలోని జాతీయగ్రంథమాలపక్షమున

ప్రచురింపబడెను హైన్దాయువజనోద్యమ మను నొక చిన్న గ్రంథమునకూడ రచించి ప్రచురించెను చెఱలో నున్నకాల ములలో "ఈజిప్టుచరిత్ర" యను నొక గ్రంథమును, ఉపనిష త్సారములు అను నొక గ్రంథమును రచించెను ఈరెంటి లోను యీజిప్టుచరిత్ర అచ్చువడ లేదు ఉపనిషత్సారము లచ్చువడి విక్రయమునకు సిద్ధముగ నున్నది వయోజనవిద్యా-ప్రథమపాఠములు పుస్తకముకూడ రచించెను అది విశాఖ పట్నం కాంగ్రెస్సుకమిటీచేత ముద్రింపబడినది

## గ్రంథాలయోద్యమము — యితరసంస్థలు

కాశీశ్వరరావు గ్రంథాలయోద్యమములోకూడ పని చేసెను సూరి నరసింహాశాస్త్రిగారు, అయ్యంకి వెంకటరమ ణయ్యగార్ల యుద్యమములో కలిసి పనిజేసినవారు బెజవాడ లోని రామమోహనగ్రంథాలయస్థాపనము వీరందరికృషి యొక్క ఫలితమే అనేకచోట్ల గ్రంథాలయములు స్థాపించి యుపన్యాసముల నొసంగి మహామహుల వర్ధంతుల జయం తుల జరిపించి యుద్యమమును పైకి తీసికొని వచ్చెను నంది గామలో నొకకమిటీ ఈయన యధ్యక్షతక్రింద స్థాపింపబడినది నలువదివేలరూప్యముల వసూలుచేసి ఒక హైస్కూలును ఒక బాలికాపాఠశాలను స్థాపించెను 1920 సం॥రము వఱకు దాని

కధ్యక్షుడుగనుండి మంచి యుపాధ్యాయుల నియామకము లోను, పాఠ్యగ్రంథముల నిర్ణయములోను మంచిశ్రద్ధ తీసుకొని పనిచేసెను తరువాత సహాయనిరాకరణోద్యమములో పనిచే యుట ప్రారంభింపగనే ఆపదవికి రాజీనామా నొసంగెను 1921 మొదలు 1925 వఱకు బెజవాడలో వేనకువేలు సొమ్ము వసూలుచేసి జాతీయపాఠశాలను నెలకొల్పెను దాని కితడే అధ్యక్షుడు వేముల కూర్మయ్య యనుహరిజనుడు కాళేశ్వర రావు యింటిలోనుండి ఆజాతీయపాఠశాలలో జదివి పిదప హిందూయూనివర్సిటిలో ప్రవేశించి యచ్చటిపరీక్షలలో నుత్తీ ర్ణుడయి బి ఎ యల్ యల్ బి చదివి శాసనసభ్యుడయ్యెను ఆంధ్రరాష్ట్ర హిందీసంఘములో కాళేశ్వరరావు కొంతకాల ముపాధ్యక్షుడు ఆంధ్రవిశ్వవిద్యాలయపు సెనేటులో కొన్ని సంవత్సరములు సభ్యుడు ఆంధ్రరాష్ట్రహరిజనసంఘములో శాశ్వతసభ్యుడు 1926 నుండి 1929 సం॥వఱకు మద్రాసు లెజి స్లెటివు కౌన్సిలులో సభ్యుడు 1930 లో జరిగిన లాహోరు కాంగ్రెస్సు తీర్మానానుసారము ఆపదవికి రాజీనామా యొసం గెను 1916 సం॥రములో కృష్ణానదివఱదల బాధానివారణ కొకసంఘ మేర్పడినది అందు కాళేశ్వరరావు అధ్యక్షుడు జిల్లా కాంగ్రెస్సు కమిటీకి అధ్యక్షుడుగ స్వరాజ్యపార్టీకి అధ్య క్షుడుగ, ఆంధ్రరాష్ట్రకాంగ్రెస్సుసంఘమునకు ముఖ్యకార్య

దర్శిగ పనిచేసి యుండెను మరియు బెజవాడలోని మ్యునిసిపల్ సంఘమునకు రెండుసార్లధ్యక్షపదవిని స్వీకరించెను

## పురపాలకాధ్యక్ష పదవి

1925 ఏప్రియల్ మొదలు 1930 ఏప్రియల్ వరకు బెజవాడ పురపాలకసంఘమున కధ్యక్షుడుగ పనిచేసి విరమించుకొనెను 1931 అక్టోబరులో తిరిగి మ్యునిసిపల్ యెన్నికలు జరిగినవి ఈయననే అధ్యక్షుడుగ నుండవలసినదని ప్రజలు కోరిరి కాని కాళేశ్వరరా వందుల కంగీకరింపక నిలువలేదు ఈయన చైర్మనుగా పనిచేసినంతకాలము మ్యునిసిపల్ వ్యవహారములు బహుజాగరూకతతో నడచినవి

కాళేశ్వరరావు మ్యునిసిపల్ చైరుమనుగా నున్నప్పుడు టౌను ప్లానింగు తయ్యారుచేసి కావలసిన వసతులు కలుగుటకు కృషి సలిపెను ముందుగా విద్యుచ్ఛక్తి, నీటివసతిలో అభివృద్ధి, పాలిపట్టణములో 7½ లక్షలు పెట్టి మురుగుకాల్వలు నిర్మాణము కావించెను గాంధీపార్కును అందులో నొకగ్రంథాలయమును నిర్మింపజేసెను కాలవలపై వంతెనలు నేర్పాటు జేయించెను పెద్దమార్కెట్టు కట్టుటకును రైలువే లెవెల్ క్రాసింగువంతెన నేర్పాటుచేయుటకును ప్లానులు యెస్టిమేట్లు తయారు చేయించి ప్రభుత్వముయొక్క శాంక్షను పొందెను కాని ఆయన జైలునకు వెళ్ళుటచే నాయనకాలములో నవి

పూర్తిగాక పిమ్మట పూర్తి యయ్యెను బెజవాడలో అయిదు గ్రంథాలయములు నెలకొల్పుటలో తోడ్పాటు గావించి వానికి గ్రాంటుల నిప్పించెను పాఠశాలల నన్నింటిలో జాతీయకీర్తనలు పాడింపించెను రాట్నములు పెట్టించెను నూలు వడికించి యఖిలభారత చరఖాసంఘమునకు బంపగా మహాత్మాగాంధీగారు యంగు యిండియాపత్రికలో ప్రశంసించిరి హిందీని ప్రవేశపెట్టెను ఇందుల కిప్పటి పాత్రో గవర్నమెంటులో పోట్లాటవలసి వచ్చినది నాన్‌కో-ఆపరేటర్ల కుద్యోగముల నిచ్చెను ప్రాథమికోపాధ్యాయులసంఘ మేర్పరచి వారిలో ఖద్దరునం దభిమానము పెంపొందింపజేసెను జాతీయతత్వమును పూర్తిగా ప్రవేశపెట్టెను హైస్కూలులోను ప్రాథమికపాఠశాలలలోను పెట్టబడు పాఠ్యగ్రంథములన్నింటిని ఈయన చదివి వానిలో జాతీయతత్వమును బోధించు గ్రంథములనే ప్రవేశపెట్టెను ముఖ్యసమయములలో నెల్ల జాతీయపతాకముల నెగుర వేయుచుండెను 1929 సం॥రమున మహాత్మాగాంధీగారు తమహరిజననిధికి యాంధ్రదేశములో సంచారము చేసిరి అందు ముందుగా బెజవాడకు పశ్చిమకృష్ణజిల్లాకు వచ్చిరి అపుడు కాశేశ్వరరావు హరిజననిధి రూ ॥6,000 యిర్వై ఆరువేలరూపాయిలు వసూలుచేసి గాంధీగారి కిచ్చియున్నాడు 1929 సం॥ ఫిబ్రవరి నెలలో సైమన్

కమీషన్ బెజవాడమీదుగా వెళ్ళుచుండగా అక్రిందటిదినమే మ్యునిసిపాలిటీ కాళేశ్వరరావు అధ్యక్షతక్రింద సమావేశమై "సైమను వెనుకకు మరలిపొమ్ము" అను తీర్మానమును మ్యునిసిపల్ బిళ్ళ ధరించిన డఫేదారుచే సైమన్ ప్రభువున కందజేయించెను దానిని తీసికొని చూచి విప్పి చదివి గొప్ప ఆశాభంగమును పొంది జిల్లాకలక్టరున కాకాగిత మిచ్చెను కాంగ్రెస్సు సేవకులు నల్లజండాల నెగురవైచిరి వారు తెన్నాగ గుంటూరునకు వెళ్ళిరి అక్కడకూడ సైమన్ బహిష్కారమునకై జరిగిన నల్లజండాల ప్రదర్శనములోను నాటిసాయంకాలమున జరిగిన బహిరంగసభలోను కాళేశ్వరరావు పాల్గొనెను అవసరము వచ్చినప్పుడెల్ల ప్రభుత్వమును జాగ్రత్తగ నెదుర్కొటలో నీయన పేరెన్నికగన్నవాడు ఒహునమర్థుడు — విజయవాడ మహిళానంఘమున కీయనయధ్యక్షతక్రిందమ్యునిసిపల్ సంఘము వారొకభవనముకు దొడ్డిని సుమారు ముప్పదివేలరూప్యములు ఖరీదుగలది విరాళముక్రింద నిచ్చియున్నారు దానిలో స్త్రీలు పదిహేనువేలరూపాయలు చందాలమూలమున వసూలుచేసి ఒకలైబ్రరీని, ఒకమెటర్నిటీవార్డును పెట్టియున్నారు ఈయన మ్యునిసిపల్ ఛైర్మన్ గానుండి గ్రామమునకు చేసిన సేవకు నీయనపేరు చిరస్థాయిగ నుండవలెననుతలంపుతో బెజవాడ యందు కట్టిన క్రొత్త పెద్దమార్కెట్టునకు "కాళేశ్వరరావు

మార్కెట్టు" అని పేరుపెట్టి బెజవాడ పురపాలకసంఘమువా రీరీతిగ తమవిధ్యుక్తధర్మమును నెరవేర్చుకొనగలిగినారు

## కాంగ్రెస్సు సేవ

1921 లో కాళేశ్వరరావు న్యాయవాదివృత్తిని వదలి వైచినప్పటినుండియు యావత్కాలము కాంగ్రెస్సువాదిగా దేశస్వతంత్రపోరాటములో పనిచేసియున్నాడు 1920 సం॥ రములో మద్రాసుశాసనసభకు నిలచువారికి ఓట్లు నివ్వవద్ద నియు, ఆశాసనసభలు బహిష్కరించవలసినదనియు గొప్పప్ర బోధము గావించెను 1921 మార్చి 31 వ తేదీని 1 వ ఏప్రి యల్ తేదీని ఈయన యాందోళనముపై యఖిలభారతకాంగ్రె స్సువర్కింగుకమిటీ బెజవాడలో జరిగెను మహాత్మాగాంధీ, దాసు, నెహూ్రు, జవావరులాల్, లజపతిరాయి, రాజేంద్ర ప్రసాద్, వల్లభాయిపటేల్, మహమ్మదల్లీ, షౌకతాల్లి, అబ్దుల్కలాంఅజద్, హాకీంహాజ్మల్ఖాన్, రాజగోపాలాచారి, పట్టాభిసీతారామయ్య, వెంకటప్పయ్యపంతులు, ప్రకాశం, సరళాదేవి, సరోజినీదేవి, మొదలైన నాయకు లందరు వచ్చి యుండిరి ఒకకోటిరూపాయలు తిలక్ స్వరాజనిధి వసూలు చేయవలయు ననుతీర్మానమును, ఇరవైలక్షల రాట్నములు నెల కొల్పవలె ననుతీర్మానమును ఆసభలో నామోదింపబడినవి

వారందఱికి వలయు నేర్పాట్లు చేయుభారము కాశేశ్వరరావు మీాద పడెను అప్పటి కింకను తగిన కాంగ్రెస్సుసంఘముల నిర్మాణము బాగుగ లేదు ఆపిమ్మట ఆసంవత్సరమే ఆంధ్ర కాంగ్రెస్సుకమిటి పక్షమున రాయలసీమసంచారము చేసి వచ్చెను బెజవాడలో జరిగిన సత్కారములో వచ్చిన వేనకు వేలుజనులకు ప్రతిదినము గాంధీమైదానములో కాంగ్రెస్సు నాయకుల యుపన్యాసము లేర్పాటుజేసెను ఈయన మొదట సారి 1922 సం॥ రములో చెరలో పెట్టబడెను 1930 యేప్రి యల్ 21 వ తేదీని బందరున కెనుబదిమంది వాలంటీర్లతో పోయి సముద్రమువద్ద ఉప్పుసత్యాగ్రహము చేసినందులకు కాశేశ్వరరావుకు ఒకసంవత్సరము శిక్ష విధించిరి ఇది రెండవ సారి. 1931 మార్చిలో గాంధీయిర్విన్ ఒడంబడికవలన నీయన విడుదలయ్యెను మొదటిసారి కడలూరు జెయిలులోను రెండవ సారి రాజమండ్రి, తిరుచునాపల్లి, రాయవెల్లూరు జెయిళ్ళ లోను ఉండెను

పిమ్మట సంధికాలములో రాష్ట్రకాంగ్రెస్సు అధ్యక్షు లైన గంపలగూడెం కుమారరాజాగారు రాజీనామానీయుగ అధ్యక్షుడే లేసందున నుపాధ్యక్షునియెన్నిక లేనందువల్లను, ఎక్కువబాధ్యత ముఖ్యకార్యదర్శిగా నున్నకాశేశ్వరరావు మీాద పడెను ఆకాలములో చిత్తూరుజిల్లాలో నధికారులు

జాతీయపతాకము నిషేధించిరి శాంతముగా కల్లుసారాయి పికెటింగు జరుపుచున్న లాయర్లపై దౌర్జన్యముక్రింద కేసులుం పెట్టిరి కాశేశ్వరరావు జిల్లాలో కాలుపెట్టిన ఎరెస్టుచేయుదు మని పోలీసువారు బెదరించిరి పంచాయితీలు పెట్టుకున్నందు లకు కవ్వములో కేసులు పెట్టిరి ఇదియంతయు ప్రభుత్వము నకు దెలుపుచు నాంధ్రప్రవర్కింగుకమిటీని చిత్తూరులో జరిపి కొంతయాందోళనమును జరిపెను పిదప అధికారులు తమ యుత్తర్వులను రద్దుపఱచుకొనిరి అపుడు చిత్తూరు, కడప, అనంతపురంజిల్లాలలో కాశేశ్వరరావు సంచారము చేసెను కృష్ణా పశ్చిమగోదావరి తూర్పుగోదావరిజిల్లాలలో శాసనసభ యొక్క విచారణసంఘము కూడదని చెప్పెను ప్రభుత్వము భూమిపన్నును, నీటితీరువను హెచ్చించిరి కాని కాలముమారి ధరలు పడిపోయి రైతులు కూలిపోయినదినములవి ఈమూడు జిల్లాలలోను రైతుసంఘములు స్థాపించి వేలకువేలు సభ్యుల జేర్పించెను ఆచార్యారంగా, బాపినీడు, నారాయణరాజుగార్లు పన్నులు హెచ్చింపకూడదని రహితులతో గూడి యాందోళ నము తీవ్రముగా జేసిరి ఈవిషయములో కాశేశ్వరరావు కూడా బాగుగా పనిచేసెను నెల్లూరుజిల్లాలో వెంకటగిరిజమీం దారువలన రైతులకు బాధలు వృద్ధియయ్యెను వెంకటగిరిలో కాశేశ్వరరావు చేసినసభను అచటిజమీందారీవర్గములోనివారు

వచ్చి చెదరగొట్టిరి అటు గవర్నమెంటు రయితుల నిటు జమీందారిరయితుల సమస్యలు పరిష్కారార్థము కాశేశ్వర రావు, వల్లభభాయిపటేలుగారిని, జవహర్‌లాల్ నెహ్రూగారిని చూచివచ్చిరి వల్లభభాయిపటేలుగారు ఆంధ్రరైతుసమస్య గూర్చికూడ యిండియాకార్యదర్శితో మాట్లాడవలసినదని లండన్‌లో నున్న మహాత్మాగాంధీగారికి కేబిలుగ్రాము నిచ్చిరి రైతులు పన్నులనిరాకరణము గావించెదరేమోయని గవర్న మెంటు భీతిల్లిరంగా, శాపినీడుగార్లను ఎరెస్టుచేసిరి నారా యణరాజుగారిపై కేసుపెట్టిరి ఇంతలో గాంధీగారు సంధికుదర క నింగ్లాండునుండి మరలివచ్చెను అపుడు బొంబాయినగర మున నిరుపమానమైన స్వాగత మీయబడెను ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్సువారిచే పంపబడి కాశేశ్వరరావు స్వాగతములో పాల్గొని యాంధ్రరైతుసమస్యలు గాంధీగారికి విశదపఱచి మఱలివచ్చెను 1932 సం॥ జనవరి 1 వ తేదీని గాంధీగారికి నింటర్‌వ్యూ నిచ్చుటకు వెల్లింగ్టన్ నిరాకరించుటచే అఖిలభా రతకాంగ్రెసు వర్కింగుకమిటీవారు సమావేశమై శాసనోల్లం ఘనమును ప్రకటించిరి కాశేశ్వరరావు బొంబాయినుండి తిరిగి వచ్చుచుండగా బెజవాడస్టేషనులో సెక్షను 108 జామీ నునేరముక్రింద బైండోవరుచేయుటకు ప్రయత్నింపగా జామీ నిచ్చుటకు నిరాకరించుటచే నొకసంవత్సరము కఠినపఱికము

వకు శిక్షింపబడి రాజమండ్రిజెయిలునకు పంపబడెను అప్పుడు కూడ ఏ క్లాసు నిచ్చిరి ఇది మూడవసారి

కొంతకాలము రాయవెల్లూరుజైయిలులోగూడ గడ పెను 1933 సం॥రమున మరల జైలునకు నాల్గవ పర్యాయము వెళ్లెను అప్పుడు జబ్బుచేయుటచే త్వరలో విడిచి బెట్టబడెను 1940 సం॥ వ్యక్తిసత్యాగ్రహోద్యమము చేయుదునని నోటీసు నివ్వగా నవంబరు 25 వ తేదీరాత్రి డెటిన్యూగా తీసికొనివెళ్ళి 1941 నవంబరులో విడుదలచేసిరి ఇది అయిదవసారి జైలునకు పెడలుట 1942 సం॥ ఆగస్టుమాసములోని జాతీయవిజృంభణ ములో నారవసారి డెటిన్యూగా బట్టుకొనబడి మొదట రాయ వెల్లూరుజైలునకును అక్కడనుండి అమరావతిజైలునకును తీసి కొనివెళ్ళబడెను మొన్న సీనడుమ 1944 సంవత్సరములో చాలా జబ్బుచేయుటచే విడుదలజేసిరి ఈయన కారాగార వాసములో నుండగా హిందీ ఉర్దూభాషలు కొంతవఱకు జది వెను ఆశియాఖండములోని అన్నిదేశములస్వతంత్రపోరాట ములచరిత్రలు ఐర్లండు, ఇటలీ, ఇంగ్లాండు, రష్యా, జర్మని, ఫ్రాన్సు, అమెరికాలచరిత్రలును గతయుద్ధానంతర ప్రపంచ ఆర్థికచరిత్రలను చదివిరి కారల్‌మార్క్సు, లెనిన్, స్టాలిన్, సోవియటురష్యాచరిత్రల బాగుగా చదివి కమ్యూనిష్టుతత్వ మును పూర్తిగా నవగాహనము చేసుకొని కమ్యూనిజంవలన దేశమున కరిష్టమేగాని లాభము లేదనియు, అట్టికమ్యూనిష్టు

వాదమును ప్రజ లామోదింపరాదనియు, గాంధీమహాత్ముని నాయకత్వము భరతవర్షము యొక్క స్వాతంత్ర్యసంపాదనము నకేగాక ఆఫ్రికా అమెరికాలలోని నల్లజాతులకు మోక్షము నిచ్చుటకు సాధ్యమైనదనియు నితఁడన నిశ్చితాభిప్రాయమును గలిగియుండెను. బాల్యమునుండియు సాధుసంస్కర్తయగుటచే అన్నిమతగ్రంథములను ముఖ్యముగా ఖొరాన్, బైబిల్, ఉపనిషత్తులు, భగవద్గీత, బ్రహ్మసూత్రములు మొదలగునవి చదివియుండెను. విద్యావంతులకు చెరసాలలు పాఠశాలలు. పెక్కుగ్రంథములు చదువుకొనుటం, నితరులకు చదివి చెప్పుటకు క్రొత్తగ్రంథములు వ్రాయుటకు కారాగారము సావకాశ మొసగినంత వేరొక్క ఆవాస మొసగనేరదు. తిలక్ మహాశయుడు వ్రాసిన గీతాభాష్య మచ్చటనే, జవహరుపండితుడు వ్రాసిన ముఖ్యగ్రంథము లచ్చటనే, డాక్టరు పట్టాభి యచ్చట నొకమంచిగ్రంథమును పూర్తిజేయుచున్నాడని వినికిడి. ఇంకను పెక్కండ్రుత్కృష్టగ్రంథముల జదివినది, రచించినది కారాగారములయందే!

కారాగారములలో చీట్లాటలతో, పోట్లాటలతో కాలక్షేపము చేయువారిని చేసినవారిని బాగుగ నెరుగుదును. మంచి తీరుబడి, చదువుకొనుటకు మంచిగ్రంథములు, సత్కాలక్షేపము సేయుటకు మంచిసహవాసము, కలిగియున్న కాలములోగూడ పెక్కండ్రు శిక్షాకాలము వృథజేసి యేవిధమగు నభివృద్ధి

లోనికిని రాక, పైగా దురలవాటుల నలవఱచుకొని జీవితముల దుఃఖభాజనములఁ జేసుకొనినవారిని నే నెఱుగుదును అట్టివారు నూటి కేవదిమందియో గలరు విద్యాగ్రంథము తక్కువై గాంధీగారియాజ్ఞానుసారము చెరకు వెళ్ళుటే దేశోపకారమని భావించి, శిక్షాకాలము నెల్లెట్లో దొఱలించుకొని, వచ్చిన దేశ సేవకులుం గలరు చెరసాలయే పాఠశాలగా భావించి, వివిధమత రాజకీయ, సాంఘిక, నైతిక, శాస్త్రీయగ్రంథముల విశేషముగ బఠించి, జీవితాశయముల పరమార్థమును బొందగలిగిన మహాశయులు దేశసేవకులలో గలరు పాత్రనుబట్టి జలము వచ్చునట్లు, పాత్రతనుబట్టి విజ్ఞానముకూడ నలవడునుగదా! అట్టి ద్వాయావ్యక్తులు జేసికొనిన సుకృతదుష్కృతములబట్టి యుండును విద్యావంతులకైన వివిధగ్రంథపఠనమునకు, కారాగారవాసఫలితముగ, సావకాశము నిప్పించినందులకు, గాంధీజీని కొనియాడ దగును

ఇట్టిసావకాశమును పోగొట్టుకొనకుండ, కాశేశ్వరరావు వివిధసద్గ్రంథపఠనమును గావించి, మంచియాశయముల నభివృద్ధి పఱచుకొనెను ఈప్రకరణమును ముగించునప్పు డొక్కవిషయమును వ్రాయవలసియున్నది 1906 వ సంవత్సరమునుండి కాశేశ్వరరావు కాంగ్రెస్సులో జేరి పనిచేయుట ప్రారంభించెను 1920 సం॥రములో జరిగిన కాంగ్రెస్సుతో దేశము మేల్కాంచినదని చెప్పవచ్చును పెక్కండ్రాకాలమునుండియే కాం

గ్రెస్సుదీక్షను తీసికొని పనిజేయప్రారంభించిరి అంతకు ముందు కాలములో కాంగ్రెస్సునకు వెడలు ఆంధ్రదేశీయులు కలరు వారిలో పెక్కండ్రు తీర్థయాత్రలకు బోవురీతిని కాంగ్రెస్సునకు వెడలుటయేగాని రాజకీయములయందు పాల్గొని పనిజేసినవారు తక్కువ ప్రతిసంవత్సరము డిశెంబరునెలలో జరుగు కాంగ్రెస్సునకై దూరమునకు, వ్యయమునకు, కాయకష్టము నకు సహించుకొని వెడలివచ్చియు కాంగ్రెస్సు చూచివచ్చితి మనుసంతోషమును పొందుటతప్ప చేయునది లేక కాలక్షేపము జేసిన న్యాయవాదులు వర్తకులు పెక్కుపట్టణములందు పూర్వమునుండియు గలరు కాని శ్రీ శ్రీశ్వరరావు వినోదార్థమయి కాంగ్రెస్సునకు పోక జాతీయాభిమానమును పురస్కరించుకొని 1906 సం॥రము నుండియు కాంగ్రెస్సువాదిగానుండి దేశములో మంచి ప్రబోధమును గావించుచు పనిచేసిన దేశసేవకులలో నొకడు 1917 సం॥రంనుండియు అఖిలభారతకాంగ్రెసుకమిటీలో నెడతెగకుండ సభ్యుడుగా నుండెను కావున కాంగ్రెస్సు ఆజ్ఞలను శిరసావహించుచు, గాంధీజీకి సరియగు ననుచరుడై యొడుదుడుకులు లేని చక్కని రాజమార్గమున కాంగ్రెస్సును కొనసాగలిగిన దేశసేవకుడు దౌర్జన్యరాహిత్యసత్యాగ్రహతత్వము సంపూర్ణముగ నలవఱచుకొని గాంధిజీ గీసినగీటున కడుగుదాటకుండ సంచరించెను

## మద్రాసుకౌన్సిలు

ఈయన మద్రాసుశాసనసభ కభ్యర్థిగ రెండుసారులు నిలచి రెండుసార్లును విజయమంది శాసనసభాసభ్యునిగ పనిచేసి యుండెను మొదటిసారి 1926 సం॥రము నవంబరుమాసములో జరిగిన యెన్నికలు రెండవసారి 1937 సం॥ జరిగిన యెన్నికలు మొదటిసారి 1926 సం॥రము మొదలు 1929 ఆఖరి వఱకును, రెండవసారి 1937 మొదలు 1939 వఱకును పదవీ స్వీకారమును చేసి వ్రిజానే ) జేసెను 1926 సం॥ శాసనసభ యెన్నికలలో కాంగ్రెస్సు అభ్యర్థులే యెక్కువ మంది జయ మొందిరి అందుచే గవర్నరు కాంగ్రెస్సువర్గమునకు మంత్రిత్వ మిచ్చి పరిపాలనాబాధ్యత కాంగ్రెస్సువారి హస్తగతము చేయ వలెనని తలంచెను ఆ రీతిగా కాంగ్రెస్సు నాయకులకు వర్తమానించెను కాంగ్రెస్సు సభ్యులు యస్ శ్రీనివాస అయ్యంగారియింట్లో సమావేశ మయిరి ఆచర్చలో సత్య మూర్తి, నరసింహరాజు, సల్డాన్హా, ముత్తయ్య మొదలగు వారు మంత్రివర్గము నేర్పఱచవలెనని వాదించిరి మంత్రివర్గ మేర్పరుపవలదని కాంగ్రెస్సుతీర్మానమున కనుకూలముగా వాదించినవారిలో మొదటి ాడు కాళేశ్వరరావు కాంగ్రెస్సు పార్టీ శాసనసభలో ప్రభుత్వవ్యతిరేకపక్షమున నేర్పడి 1930 సం॥రమున కడవఱకు పనిచేసెను 1929 సం॥రమున డిశంబరు 31 వ తేదీని చేయబడిన లాహోరు కాంగ్రెస్సుతీర్మానప్రకా

రము 1930 సం॥రమున జనవరి 4 వ తేదీ, కాశేశ్వరరావు గారంతుగార్లు తమవదవులకు రాజీనామా నిచ్చిరి సత్యమూర్తి రాజీనామా నిచ్చునప్పటికి మరిరెండు నెలలు పట్టెను హరి సర్వోత్తమరావుగారు రాజీనామా యొసంగలేదు కాంగ్రెస్సు తీర్మానము నతిక్రమించినందున కాంగ్రెస్సులో పలుకుబడి వీరికి తగ్గిపోయెను

శాసనసభలో నున్నకాలములో కృష్ణ పశ్చిమగోదావరి తూర్పుగోదావరిజిల్లాల రిసెటిల్ మెంటులో రూ 1కి 0—3—0 వో॥న భూమిపన్నును నీటితీరువాయిని వృద్ధిచేయవలెనని ప్రభుత్వము తలంపగా నది చేయకూడదని కాంగ్రెస్సు పార్టీనాయకులు గట్టిగా వాదించి యొకశాసనసభవిచారణ సంఘమును నిర్ణయింపజేసిరి ఆచర్చలో కాశేశ్వరరావు పూర్తిగా పాల్గొనెను ఆవిచారణసంఘము కృష్ణజిల్లాకు వచ్చినపుడు రైతులపక్షమున కాశేశ్వరరావుసాక్ష్యమును సమకూర్చి వారియెదుట పెట్టెను ఆకమిటీకి కార్యదర్శిగా పనిచేసి రైతులక్షేమార్థము పన్నులు హెచ్చింపరాదని రిపోర్టు వ్రాసి ఆచార్యరంగా ప్రఖ్యాతిలోనికి వచ్చెను మద్రాసు యొస్టేటులాండులక్టు రైతుల కనుకూలముగా సవరణచేయవలెనని ఆయుద్యోదమును ప్రోత్సహించి హరిజన లకు నూతులు, చెరువులు, మూరెట్టులు, సత్రములు మొదలగువానిలో ధారాళప్రవేశ ముండవలెనని ప్రత్యేకాంధ్రరాష్ట్రము నేర్పఱచవలెనని కాశేశ్వర

రావు తీర్మానములు తెచ్చి జయమొందెను మ్యునిసిపాలిటీ లలో నామినేషనులు, పూర్తిగా తీసివేసి అందలి సభ్యులెన్ను కోబడవలెనని, మైనార్టీలకు సంయుక్తనియోజక వర్గముల యెన్ని కలలో వర్గసంఖ్యాప్రాతినిధ్య మివ్వవలెనని, రాజకీయనేరస్తులు స్థానిక సంస్థలకు ఎన్నికలలో నిలువకూడ దనునిషేధము తొల గించవలెననియు, స్థానిక సంస్థల అధికారములను విస్తరింపజేయ వలెననియు, ఎంతస్వల్పమైన పన్ను నొసగినను ఓటింగు అధి కార ముండితీరవలెననియు, మొదలగు క్లాజులతో కాశేశ్వర రావుగారు బిల్లు ప్రవేశపెట్టెను ఆబిల్లులోని ప్రధానాంశము లన్నియు "ఆక్టు" రూపమున మంజూరయ్యెను ఆంధ్రవిశ్వ విద్యాలయము యొక్క సవరణబిల్లులలోకూడ కాశేశ్వరరావు తీవ్రముగ పనిచేసెనుకాని సి ఆర్ రెడ్డిగారి పట్టుదలచే విశ్వ విద్యాలయము వాల్తేరునకు పోవుటయు మునుస్వామినాయుడు గారి పట్టుదలచే రాయలసీమను ఆంధ్రవిశ్వవిద్యాలయమునుండి వేరు చేయుటయు జరిగెను శ్రీ శే రాజా రామారాయణిం గారు బ్రతికియున్నంతవఱకు బెజవాడనుండి విశ్వవిద్యాల యము పోవుటగాని రాయలసీమ విడిచిపోవుటగాని జరుగ లేదు మదాసుప్రభుత్వము నాన్‌కో ఆపరేషన్‌లో పాల్గొన్నరైతుల భూముల సాగునకు నీళ్ళియక వానిని పాడుపెట్టియుండిరి దాని విషయములో కాశేశ్వరరావు విశేషశ్రమ శ్రద్ధ తీసికొని ప్రభు త్వమును లొంగదీసెను శ్రీ ఉన్నవలక్ష్మీనారాయణగారు

రచించిః మాలపల్లెమీద ప్రభుత్వమువారు వేసిన నిషేధ ముః తొలగింపజేసెను మొంటపర్యాయము కౌన్సిలులోనికి వెళ్ళినప్పుడు చేసిన పనియిది శ్లాఘాపాత్రము గనున్నది రైతు సమస్య, హరిజనసమస్య ఈయనను బాగుగ నాకర్షించిఈయన దృష్టిని కేంద్రీకరింప జేసుకొనినవి ఈసమస్యలను నక్రమమై, న్యాయసమ్మతమై, శాసనబద్ధమైన, పోరాటము లతో బాగుగ పరిష్కరింపుచు వచ్చెను ప్రజలకు వలసిన యుత్సాహము, ప్రభుత్వమునకు వలసిన రొత్తిడి నొసంగుచు దేశహితైక కార్యముల జాగ్రత్తగ నొడుదుడుకు లేకుండ నొన గూర్చిన వారిలో కాళేశ్వరరావు ముఖ్యుడు

ఈయన 1937 సం॥రమున కాంగ్రెస్సుపక్షమున మద్రాసుశాసనసభకు బెజవాడ బందరుపట్టణముల సాధారణ స్థానమునకు పోటీ చేసెను ఈయనతో పి వి నారాయణ గారు జస్టిస్సుపక్షమునను, గుమ్మడిదల వెంకటసుబ్బారావుగారు ఆంధ్రస్వరాజ్యపక్షమునను, జి రామచంద్రరావుగారు పీపిల్సు పార్టీపక్షమునను యెన్నికలకు నిలచి పోటీ చేసిరి వీరిలో అయ్యదేవర కాళేశ్వరరావుకు (9,050) పి వి నారాయణ గారికి (389) గుమ్మడిదల వెంకట సుబ్బారావుగారికి (42) జి రామచంద్రరావుగారికి (9) మాత్రమే ఓట్లు వచ్చినవి వీరందరిలో జయమందినది కాళేశ్వరరావు ఈయెన్నికలలో కాంగ్రెస్సుపక్షము సంపూర్ణజయమందినను వెంటనే శాసన

సభలలో ప్రవేశింపలేదు నాలుగైదునెలలు వ్యవధి వచ్చినది కాంగ్రెస్సుసంస్థకును గవర్న్మెంటునకును మధ్య వచ్చిన తగాదా పరిష్కారమైనదనుక శాసనసభలలో ప్రవేశింపలేదు రాజీయైనపిదప శాసనసభాప్రవేశము కలిగినది మద్రాసు రాష్ట్రములోగూడ కడమరాష్ట్రములతోబాటు కాంగ్రెస్సు అభ్యర్థులసంఖ్య యెక్కుడుగ నుండుటచే కాంగ్రెస్సుమంత్రి వర్గ మేర్పాటు కాబడెను

మద్రాసురాజధానిలో కాంగ్రెస్సువర్గములో ప్రధాన నాయకత్వమునకు నరవలపక్షమున చక్రవర్తుల రాజగోపాలా చారిగారిమీదను ఆంధ్రులపక్షమున టంగుటూరిప్రకాశము పంతులుగారిపైనను, శాసనసభానభ్యుల (ఆయా దేశస్థుల) దృష్టులు కేంద్రీకరింపబడినవి రాజగోపాలచారి పూర్తిగ నరవసోదరుడు మంచి రాజకీయవేత్త దూరదృష్టి, సమయ స్ఫూర్తి గలవాడు చాకచక్యము ఆయనసొమ్ము ఎట్టివాని నైన ఉల్టాపల్టీ కొట్టింపగల వాగ్వైఖరిగల నేర్పరి సన్యాసము తరవాయిగా సమస్తమును వదలుకొని యాశ్రమజీవితమును గడుపుచున్న రాజగోపాలచార్యులు దూరదృష్టిగల రాజకీయ వేత్తగావున, కాంగ్రెస్సు ఆదేశానుసారమున యెన్నికలకు నిలచి,విజయ మొందెను పీరివిజయ మరవసోదరుల నాకర్షించి నది. కొందరు కన్నడులను, కేరళులనుకూడ నాకర్షింపక పోలేదు. అందుచే పల్వురు పీరియాధ్వర్యముక్రిందకు వలుకు

బడిలోనికి వచ్చిరి ఆంధ్రుల సంఖ్య అరవలసంఖ్యకంటె తక్కువ అరవలేగాక మరికొందరు కన్నడులు, కేరళులునుగూడ రాజగోపాలచారిగారితో నుండుటచేతను రాజగోపాలచారిగారికి వల్లభాయిపటేలు మొదలగు కాంగ్రెసునాయకులప్రాపు బలము కలదనుకొనుటచేతను, రాజగోపాలాచారిగారికి ప్రధాననాయకత్వపదవి మొసగటనే పెద్దలు వాగ్దానము చేసి వారిని తిరిగి రాజకీయములలోనికి దింపిరి గావున వారికి తప్పక ప్రధాన నాయకత్వము వచ్చితీరునను విశ్వాసముచేతను, చక్రవర్తుల రాజగోపాలాచారి ప్రధానామాత్యుడైనచో పిదప కొన్ని మంత్రిపదవులు, తదితరపదవులు రాబట్టుకొనవచ్చునను నభిప్రాయముతో నాంధ్రులే కొందరు రాజగోపాలాచారిగారి పక్షమున జేరిపోయిరి అట్టిపరిస్థితులలో ప్రకాశంగారిని ప్రధాన నాయకత్వమున కాంధ్రులపక్షమున పోటీచేయించి ఓడింపించుటకంటె పోటీ చేయించకుండ నుండుటే గౌరవదాయకమగు నుండుననియు ఆంధ్ర - అరవతగాదాలు రచ్చకెక్కకుండ నుండగలవనియు కాంగ్రెస్సులో విభేదములు కలిగినవని పరుల కెగతాళిసేయుటకు సావకాశ ముండగూడదనియు నిశ్చయించుకొని నాటియాంధ్రనాయకు లందరు కలసి ప్రకాశం పంతులుగారిని మానిపించి చక్రవర్తుల రాజగోపాలాచారిగారిని ప్రధాననాయకత్వపదవికి నెన్నుకొనిరి ప్రకాశంపంతులుగారికి నాయకత్వపదవీవ్యామోహము లేదని లోకమునకు సూచించు

ట్రైకి, వారిచేతనే రాజగోపాలాచారిగారి నాయమాత్యపదవి నుపపాదింపజేసిరి

ఈరాజగోపాలచారిగారి మంత్రివర్గములో కాళేశ్వర రావు ప్రధానశాసనసభాకార్యదర్శి అనగా రాజగోపాలాచారి గారి కార్యదర్శిగా నెన్నుకొనబడెను మరియు పార్టీకి ఛీఫ్ విప్పుగాకూడ నెన్నుకొనబడెను

కాళేశ్వరరావు శాసనసభలో ప్రవేశించి పనిచేయుట ప్రారంభించినపిదప, ఆంధ్రరాష్ట్రతీర్మానమున కామోదించి యాతీర్మానమును రాజగోపాలాచారిగారికి చూపిరి ఆతీర్మానము పార్టీమీటింగులో చర్చకు వచ్చెను రాజగోపాలాచారి గారి సలహాపైన నది యామోదింపబడెను 1 మద్యపాననిషేధ చట్టము, 2సేల్సుటాక్సుచట్టము, 3 హరిజన దేవాలయప్రవేశ చట్టము4వ్యవసాయకుల ఋణవిమోచనచట్టము మొదలగునవి నాటికాంగ్రెస్సుమంత్రివర్గమువారిచే నామోదింపబడి చట్టము లైనవి మద్యపాననిషేధము నాలుగుజిల్లాలలో ప్రవేశపెట్ట బడెను అది జయప్రదముగా సాగుచుండెను మిగిలినజిల్లాలలో కూడ ప్రవేశపెట్టి నాలుగుకోట్ల రూప్యములు పోగొట్టుకొన దలచిరి ఆదివ్య మితరపన్నులవలన భర్తీ కాకపోయినచో పాఠశాలలు మూసివేయవలసియున్నది కావున క్రొత్తపన్నులు వేసి తీరవలసిన యవసరము వచ్చినది 1935 సం॥రపు గవర్న

మెంటు ఆఫ్ యిండియాయాక్టును పరిశీలించి రాష్ట్రశాసన సభలు విధించగల పన్నులేమో తెలిసికొనిసహిమ్మట సేల్సు టాక్సును విధించుటకు నిశ్చయించి చట్టమును చేసి ప్యాసుచేసినారు అట్టిపన్నులు అమెరికాలోని స్టేట్సులోను యూరపుఖండములోని దేశములలోను వేయబడుచున్నవి

ఇక్కడ నొక్క విషయము చెప్పవలసియున్నది సేల్సు టాక్సు వేయుటకు గలకారణము తాగుడు మాన్పించుటకు — ఆబ్కారీ తీయించివేయుటకుగదా! ఆపని పూర్తిగా నెరవేరినచో దేశమునందు లక్షలకొలది కుటుంబము లత్యానందముతో వర్ధిల్లుచు నుండవలసినదే కాని సేల్సుటాక్సు విధించుటయైనది త్రాగుడు నిషేధించలేకపోయిరి కాంగ్రెసుప్రభుత్వములులోనున్నచో త్రాగుడు నున్మూలించియుండి యుందురు ఆపని పూర్తికాకముందే కాంగ్రెస్సు శాసనసభలలో నుండి తప్పుకొనుటయు, సేల్సుటాక్సు పూర్తిగ నమలులోనికి వచ్చుటయు, త్రాగుడు యధాప్రకారముగా దేశమందంతట నిలిచిపోవుటయు జరిగినది అందుచే ప్రజలకు త్రాగుడును మాన్పించి లాభములు చూపలేకపోవుట యటులుండగా అదనముగా సేల్సుటాక్సు తగులుటచే ప్రజలందరకు కీపన్నుబాధ మిక్కిలిగ్గపోయి కాంగ్రెస్సుసంస్థ దేశమునకు మహోపకారము చేసినదని యధార్థము తెలుసుకొనలేని సామాన్యప్రజ చెప్పుకొనుట ప్రారం

భించిరి దురదృష్టవశాత్తు సేల్సుటాక్సు విస్తృతమున్న అడై
జర్లు గవర్నమెంటు సద్వినియోగము చేయక పోవుటయేగా
యితరజిల్లాలలో మధ్యపాననిషేధమును ప్రవేశపెట్టుట
మారుగ నిదివఱకు ప్రవేశపెట్టబడిన జిల్లాలలోని మద్యపా
నిషేధమును రద్దుపఱచిరి ఇందువల్ల 1939 సం॥రము
సుమారు నాలుగుకోట్లరూప్యములు త్రాగుడువలని ఆ
యముకాగా నేఁడు పన్నెండుకోట్లు ఆదాయము త్రాగుడువల్ల
వచ్చుచున్నది మరల కాంగ్రెస్సుప్రభుత్వ మమలులోని
వచ్చినగాని యీయన్యాయము తొలగిపోదు ప్రకాశంపంతుల
గారి జమీందారీవిచారణసంఘమునకు తమసంపూర్ణామో
మును తెలియపఱచుచు వచ్చిరి 1939 సం॥మున యుద్ధ
రంభకాలములో శాసనసభాబహిష్కారములు జరిగిన
మద్రాసుప్రభుత్వముకూడ బహిష్కరించి వెలుపలకు
వేసెను కాని 1942 సం॥రమువఱకు కాళేశ్వరరావు రాజ
పాలాచారిగారితో నేకీభవించియే యుండెనుకాని రాజగోపా
చారిగారు మహాత్మునితో విడివడినప్పటినుండియు కాళేశ్వ
రావు రాజగోపాలాచారిగారితో విడివడెను మహాత్మాగా
గారు 1942 మేలో ఖూరాబెనుగారిచే కాళేశ్వరరావుకు
కబురంపగా కాళేశ్వరరావు కాంగ్రెస్సుతోబాటు గాంధీగా
యాజ్ఞలనే యనుసరింతునని చెప్పి ఆరీతినే రాజగోపాలాచా

గారికి తమనిశ్చితమును వెంటనే వ్రాతమూలకముగా తెలియ
చేసెను పిమ్మట 1942 ఆగస్టు 9 వ తేదీరాత్రి డిటెన్యూగా
పిలొని పోవబడినచరిత్ర లోగడ వ్రాసియే యున్నాను 1944
రము వ విడుదలయి వచ్చినపిదప గాంధీగారిని దర్శించిఆంధ్ర
శ రాజకీయములు మాట్లాడివచ్చెను ప్రస్తుతము విద్యార్థికమి
కకిని ప్రచురణశాఖాకమిటీకిని అధ్యక్షులుగ నున్నారు 1945
సం॥ మార్చి 9 వ తేదీని ఆంధ్రరాయబారవర్గముతో వార్ధాకు
వెళ్లి గాంధీగారిని దర్శించి వచ్చెను జయిలునుండి వచ్చినపిదప
1944 లో బెజవాడలో జరిగిన అఖలభారత ఆయుర్వేదకాం
గ్రెసుకు కాళేశ్వరరా వాహ్వానసంఘాధ్యక్షుడుగా నుండి
నెను 1945 లో బందరులో జరిగిన ఆంధ్రరాష్ట్రవిద్యార్థి
కాంగ్రెస్సువిజ్ఞానమహాసభకు కాళేశ్వరరావు అధ్యక్షుడు
...టలో జరిగిన జిల్లావిద్యార్థికాంగ్రెస్సుసభకు ప్రారంభ
కృష్ణజిల్లా ఎరుకలవారిసభకు అధ్యక్షుడు ఈయనమంచి
—వ్యాసకర్త—గ్రంథకర్త

## వీరి గుణములు

కాళేశ్వరరావు గొప్పసంఘసంస్కర్త హరిజనోద్ధరణాభి
పినల్‌కోడ్లు 511 సెక్షనులు బాగుగ చదివినవాడు —

మంచికరణము — మంచిన్యాయవాది — గాంధీగారిని పూర్తిగ నవగాహనము చేసికొనినాడు అనవసరమైన యావేశము తెప్పించుకొనడు ఒడుదుడుకులలో బడడు దౌర్జన్యరాహిత్యము నందే పరమవిశ్వాసము కలవాడు — విజ్ఞాని — సంస్కర్త.

శ్రీ భారతమాతకు జై

ప్రథమభాగము సంపూర్ణము

**Order** Arrangement of Line Tone and Colour, Sp in Frame Continuity of Line or Accents Concentration Colour Transition and Opposition Rhythm and Symmetr

**Balance** Tone Areas Line Placing and Spacing

**Qualities of a Good Picture** Unity Vitality Infinity pose

## Part II

### Camera Mechanism and Operating Technique

**Theory of Picture Animation** Mechanism of Vision P sistency of Vision Flicker Critical Frequency Smoothnes Animation The Intermittant Motion The Maltese Cross the Claw Movement The Shutter The Cinema Film Film I torations

**The Motion Picture Camera** Still and Motion Pict Camera Film Magazines Film Feed Mechanism The C Movement The Picture Gate The Shutter The Diaphra, The Lens Mount The Vision Finder Camera Tripod Univer Tripod Head Camera Drive Speed Stabilizer The Blimp, T Studio Camera The Portable Type Double System Camera

**Commercial Cameras** Bell and Howel Mitchell De Br Vinten Akeley Cinephone Askania Cine Kodak Pathe, Ary

**Camera Accessories** Lens Turret Lens Hood Filt Holders Variable Spy Glass, Direct Vision Finder Critic Focusser Achromatic Loup Microscopic Tube Goertz Mete Chromium Iodide Screens Focussing Scale Range Finder, F Iutive Exposure Indicator Tachometer Footage Counter Stud Tripods The Dolly The Studio Run Camera Truck The C mera Crane The Electrical Drive The Interlock System n Synchroniser Exposure Meters

**Lenses and Filters** Short Focus Lenses Telephoto Ler ses Wide Angle Lense Variable Focus Lenses, Positive Lense Equivalent Focal Length Optical Axis Angle of View Effe tive Aperture Speed Depth of Focus Resolving Power Ler Correction Calibration of Lens Mount Filters The Pola Screen

**Emulsions for Cine-Photography** Emulsion Speed Con trast and Grain General Sensitivity and Colour Sensitivity Picture Negative Emulsion Orthochromatic Type Panchrom[illegible]

**Exposure Control** Lighting Diaphragm, Emulsion, Speed, nic Value of Day Light and Artificial Light, Exposure, trast and Correct Photographic Rendition, Relation to Pro-ng, Variation of Exposure Time, Slow Motion and Fast on, Single Frame Exposure, Setting Colour and Exposure, ocity Colour and Exposure, Costume and Exposure

**Trick Photography and Effects** Stop Motion, Double Ex ure Reverse Motion Mask Boxes, Fading Vignetting, Na Pictures Superimposition, Double and Mutiple Exposure ed and Moveable Masks Iris Finder Effects Box Command he Time Factor Optical Distortion, Soft Focus, Diffusion

**Make up** Its use in Photography, Difference between ic and Panchromatic Make Up, Colour Composition Photo phic Reflection Powers Use of Panchro Make Up, Straight ke Up Corrective Make Up, Facial Modelling, Character ke Up Direct Colour Make Up Make Up Colour Charts, itation and Sterlization Body Make Up

**Lighting Equipment** Sun Spot, Lupe Light Solar Spot by Spot Rifle Light Adjustible Lamp for Close Ups, Barrel ot Bank, Victor Banquet Reflector Sun Ray Reflector Rifle ol Fresnel Lens

**Survey of Special Branches of Cine Photography** News elwork Travelogue Films Deep Water Cinematography Ae il Photography Scientific Cinephotography, Medical Work, tra Red Films Educational Films Documentary Films

## Part III

## Film Proccessing

**Processing Motion Picture Films** Developing Agents, the lkali, the Preservative, the Restrainer, Negative, Positive and ound Track Developers Replenishing Solutions, Process of evelopment, Effect of Time and Temperature on Development, ffect of Agitation on time of Development, Desensitizer, Two ath Development, Printing, and Toning

**Fixing** Process of Fixation Acid Fixing Baths, Acid ixing and Hardening Baths, Time of Fixation, Hardening ction of Fixing Baths Effect of Use on a Fixing Bath, Potas ium Alum Fixing Bath for Motion Picture Film, Chrom Alum ixing Baths, Exhaustion of Fixing Bath, Use of Two Fixing Baths Stop Baths Fixing Baths for Use with Hardened Films